ప్రథమ ముద్రణ:-
సెప్టెంబర్ 1992.
ప్రతులు :-1000

ప్రతులకు:-

- లతా ఆటో సెంటర్, బోయవాడ, కరినగర్ -1
- మాధవ నిలయం, బోయవాడ, కరినగర్-1
- హోలీ ఏంజిల్స్ హైస్కూల్, ముకరంపుర, కరినగర్ -2
- పీపుల్స్ పాఠశాల, సాయిబాబ గుడిదగ్గర, కరినగర్-1
- N.కరుణాకర్, K.P.H.B. Colony, హైదరాబాద్.

వెల: 11-00

ముద్రణ

శారదా ప్రింటర్స్ & బైండర్స్, (ఫోను 3668)
శాస్త్రిరోడ్డు,
కరీంనగర్ - 505 001

# సమర్పణ

పరమ పవిత్ర మైన
భారత మాత యొక్క
పాద పద్మములకు
నా ఈ ప్రథమ కుసుమాన్ని
సమర్పిస్తున్నాను.

రచయిత
**నందనం కృపాకర్**

# ముందుమాట

భారత దేశం కేవలం మట్టి,రాళ్ళు, నీళ్ళు మాత్రమే కాదు. ఇది మన తరతరాల చరిత్ర, సంస్కృతి జీవన మూల్యాలకు నిలయం, ఆధారం అనే భావం స్ఫురించేవిధంగా ఈ కాగితాల్లోని అక్షరాలను ఒక హారంలో ముత్యాలు గ్రుచ్చినట్లుగా రచయిత శ్రీ నందనం కృపాకర్ అక్షర మాలను అల్లినారు.

ఎన్నో చారిత్రక వాస్తవాలను మరెన్నో నిగూఢ, నిక్షిప్త విషయాలను ప్రకాశవరచి సమాజానికి అందించిన రచయిత కృషి ప్రశంసనీయమైంది.

భారతీయులంతా తప్పక చదువాల్సిన పుస్తకం ఇది. (ఇలాంటి) ఈ పుస్తకాన్ని విద్యార్థులకు ఏ పాఠ్యగ్రంథంగానో చేస్తే మన దేశ భావి స్వరూపమే మారి పోతుందనడంలో ఆశ్చర్యమేమి లేదు. యిటువంటి ప్రశస్తమైన పుస్తకాన్ని రచించిన శ్రీ నందనం కృపాకర్ నిజంగా అభినందనీయులు.

**Dr. M. Vijaya Gopal**

**M.D.**

Professor of Psychiatry
Inistitute of Mental health
Hyderabad - 38.

# కృతజ్ఞతలు

ఇది నా ప్రథమ ప్రయత్నం. ఈ నాతొలి ప్రయత్నానికి తగు స్ఫూర్తినందించింది నా తల్లి తండ్రులు, వివిధ సామాజిక సేవా సంస్థలు. అయితే నాకు మొదటి నుండి ఈ ప్రయత్నంలో సంపూర్ణంగా సహకరిస్తూ అడిగినదే తడవుగా ఈ గ్రంథ ప్రచురణకై తమ సహకారాన్ని అందించిన నా చిరకాల మిత్రులు, గౌరవనీయులు శ్రీ దారం వినోద్ గార్కి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తకం గురించి తమ అమూల్యమైన అభిప్రాయాలను ఆశిస్సులను అందించిన మాన్యులు శ్రీ భండారు సదాశివరావు అడ్వకేట్ వరంగల్. డా!! శ్రీ యం విజయ గోపాల్ ప్రొఫెసర్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్ హైదరాబాద్ మరియు మా గురువర్యులు శ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణ అష్టావధాని కరీంనగర్ గారలకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటున్నాను. అదే విధంగా శ్రీ నర్సింహ రెడ్డి, శ్రీ గౌరిశెట్టి గిరిజాపతి గారలకు నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

నా ఈ శ్రమకు ఫలితం ఈ పుస్తకం పాఠకులవద్దకు చేరడమె ఈ కృషిలో నా దృష్టి పదానికి అందకుండా ఎన్నో తప్పులు దొర్లి ఉంటాయి. విజ్ఞులైన పాఠకులు మన్నించాలని కోరుకుంటూ నా దృష్టికి తెచ్చిన (వచ్చిన)పొరపాట్లను మలి ముద్రణలో సవరించు కోగలనని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

రచయిత
నందనం కృపాకర్

శ్రీ మాత్రే నమః

# భారత ముకురము.

నంద వరాన్వవాయ సమనందనుడైన కృపాకరుండు సం
స్పందన గల్గజేయు నవభారత దివ్య చరిత్ర చక్కగా
నందగజేసె తీర్థములు నాదరణీయ విశిష్టక్షేత్రముల్
సుందర పర్వతాళి నతి సుందర తత్త్వ విశిష్ట మూర్తులన్
పొందుగ గూర్చి యీముకురముంగయిసేసె సమగ్రవిషయము
చ్ఛందనియంగ జేయుత విశాల విలోకన సాకతంబునన్

పొర్వెళ్ళ గోపాల కృష్ణ
అష్టావధాని
విశ్రాన్తోపన్యాసకులు
కరీంనగర్.

# :ఉపోద్ఘాతము:

రత్నాకరా ధౌతపదాం, హిమాలయ కిరీటినీం

బ్రహ్మరాజర్షి రత్నాఢ్యాం - వందే భారత మాతరమ్

మనము నిత్యము మాతృభూమిగా, కర్మ భూమిగా, ధర్మ భూమిగా, ఇహపరాలసేతువుగా, జగజ్జననీ స్వరూపంలో, తన ఆర్ష చైతన్యంతో విశ్వ కళ్యాణాన్ని సమకూరుస్తూ తపస్త్యాగాలను, జ్ఞాన వైరాగ్యాలను ప్రభోదిస్తూ, ప్రాచీన తమ భూమియై, సృష్టిలో ఆద్య అవతారిణియై, అజనాభ వర్షంగా, కీర్తింపబడినదే మన భారత దేశము.

## ప్రస్తుత భారత దేశము:-

దీని భూపరిమితి, 32,87,131 చ.కి.మీ. తూర్పు నుండి పడమర 2900 కి.మీ. ఉత్తరం నుండి దక్షిణం 3200 కి.మీ.

## మన దేశ భూభాగ సరిహద్దు:-

15,200కిమీ. మనదేశ తీర రేఖ పొడవు 6000 కి.మీ. పరిమాణమును బట్టి ప్రపంచంలో 7వది జన సంఖ్యను బట్టి ప్రపంచంలో 2వది మనదేశం. మూడువైపుల నీటితో దక్షిణాన హిందు మహాసముద్రం, తూర్పున (గంగాసాగర్) బంగాళాఖాతం, పడమరన (సింధూసాగర్) అరేబియా సముద్రాలతో ఉత్తరాన హిమాలయాలతో సహజ ఎల్లలు కలిగిన అత్యంత సుందర భరితమైన ఏకైక ప్రాంతం ఈ అవనిపైన మన భారత దేశం. ఉత్తరార్ధ గోళంలో ఉంది. ఆసియా ఖండవు. దక్షిణభాగాన $8^{0}$ 4' ల నుండి $37^{0}$ 6' ఉత్తర అక్షాంశాల మధ్యను గ్రీనిచ్‌కి తూర్పుగా $68^{0}$ 7'

నుండి 97$^{0}$27' రేఖాంశముల మధ్య విస్తరించి ఉంది. సమగ్ర భారతదేశవివరాలు పుస్తకంలో పొందుపరచడం అసాధ్యం. కనుక కొన్ని ముఖ్య వివరాలు మాత్రమే అందించాను. సందర్భానుసారంగా సంక్షిప్తంగాను, విశేషంగా కూడ! విషయ వివరణ చేశాను.

## భారత మాత దివ్య సుందర రూపం:-

నైసర్గిక సౌందర్యభరితము అయిన కాశ్మీరము భారత మాత ముఖ మండలమని, హిమాచ్ఛాదిత ఉన్నత గిరి శిఖరాలు భారతమాత కిరీటమని, హిమాలయ శ్రేణులలోని వన రాజ్యములన్నీ కేశకుంతలాలని, తూర్పు పశ్చిమ భాగము లందు విస్తరించిన పర్వత పంక్తులు భారత మాత కరద్వయమని పాక్ పశ్చిమ తీరములందు వ్యాపించిన పర్వత శ్రేణులు కాళ్ళని కన్యాకుమారి పాదపీఠమని, హిందూమహాసాగర తరంగ సంగీతాలు భారత మాతస్తోత్రగానమని, ఆ తరంగములు నిరంతరం భారత మాత పాద పద్మాలు ప్రక్షాళన చేస్తున్నాయని యుగయుగాలుగా ఈ మాదిరి మహిమాగానం సాగిపోతున్నది, ఈ సుందర విశ్వంలో తల్లి భారతి కీర్తి ఇలా వ్యాపించి ఉన్నదని, ఇటువంటి శ్రద్ధాయుక్త దేశభక్తి భావనతో భారత మాతను పరకీయదాస్యం నుండి విముక్తం చేసేందుకై ఎందరో దేశభక్తులు ఉరికంబాలనెక్కారని, మరెందరో దేశభక్తులు అండమాన్‌లలో తనువులు చాలించారని ఇంకా ఎందరెందరో కారాగారాల్లో జీవితాలను గడిపేశారని........ఇటువంటి ఇతిహాసం, చరిత్ర నేటి (భావి) యువతరానికి తెలియదు.

నేటి పుస్తకాలలో (స్వతంత్ర) భారత ఇతిహాసం ఆరంభమయ్యేది 1947నుండి మాత్రమే! అమర దేశభక్తుల ఈ అమూల్య బలిదానాలు నేడు విస్మరింపబడి ఉన్నాయి. భారత మాత యొక్క దైవనిర్మిత నైసర్గిక పరిరక్షిత విశాల స్వరూపం ఈనా[illegible]తమైంది.

దేశభక్తి, జాతీయత, స్వాభిమానం త్యాగసమర్పణభావాలు మచ్చుకు కనిపించకుండ కనుమరుగవుతున్నాయి. భౌతిక వాదం మితిమీరి ఆధ్యాత్మిక లేదా పవిత్రమైన అజరామరమైన మాతృదేశభావన నేటి జనతలో ప్రధానంగా యువతలో లుప్తమైంది. వీటికి సంబంధించిన ఏ అంశం ప్రధానంగా పాఠశాలల్లో బోధించ బడటంలేదు. మరి అటు వంటప్పుడు వీరంతా రేపు నిష్ఠావంతులైన దేశభక్తులుగా ఎలా తయారవుతారు?

భవిష్యత్ భారతాన్ని వైభవాన్వితత దిశలో ఎలా తీసుకెళ్తారు?

భారత దేశ, ధర్మాలను, ఉనికిని ఏవిధంగా కాపాడగలుగుతారు?

ఈ దేశం నామాతృభూమి, ఈదేశం కోసం నేను జీవించాలి, ఈ దేశంలోనే జీవించాలి. ఈ నాదేశ, ధర్మ, సమాజ రక్షణకై నేను సేవ చేయాలి. అవసరమయినప్పుడు తను మనధనాదులను స్వార్పణ చేయాలనే పవిత్రభక్తి భావన ఎలాకలుగుతుంది.

వైభవాన్వితమైన, శౌర్యసాహసాలతో కూడుకున్న అజరామరమైన మన పూర్వజుల త్యాగభరిత జీవితాలను మనం చదివినప్పుడు తెలుసుకున్నప్పుడు.

మహిమాన్వితమైన మన ప్రాచీన పరంపరను అనుదినం అనుక్షణం స్మరించుకునే అవకాశం కలిగినప్పుడు. మాతృభూమి పట్ల మమతాను రాగాలు పెరిగినపుడు. సమాజంలోని ప్రతి ఒక్కరి జీవన లక్ష్యం పరోపకారం కోసం అని భావించి చరించినపుడు. సర్వులలో సదాచారాలు ప్రబలంగా వ్యాపించినపుడు, మన వేద శాస్త్ర పురాణ ఇతిహాసాలపై ప్రబలమైన పవిత్ర భావం కలిగించినపుడు, వాటిలోని యథార్థ స్వరూప జ్ఞానం అవగాహన చేసుకున్నపుడు మాత్రమే సమాజం సమానత్వంతో సకల సుఖ శాంతులతో వర్ధిల్ల కలుగుతుంది.

దానికోసం గాను మన చారిత్రక వాస్తవాలను వక్రీకరించకుండా సమాజానికి అందుబాటులో ఉంచాలని భారతీయులందరిలో భరతమాత అణువణువు పట్ల పవిత్ర భక్తిభావన కలిగించాలనే నా ఆలోచనకు ప్రతిరూపమే"ఇదీ మనభారతదేశం " నా ఈ చిన్న ప్రయత్నము.

-రచయిత

నందనం కృపాకర్

# మన జీవనాధారాలు - నదులు

భారత దేశంలోని ప్రజలలో ఏకాత్మతాభావాన్ని నింపుతూ వేల సం.ల చరిత్రను ఆచరిత్ర సందేశాన్ని నేటికి, వర్తమానానికి ఇంకా ముందుతరాల వారికి నిరంతరంగా అందిస్తూ ప్రవహిస్తున్న మన సమాజ అవిచ్ఛిన్న జీవనాధారాలు మన నదులు. ఇవికేవలం జలధారలు మాత్రమే కావు. అన్ని రకాల భేద భావాలకు అతీతంగా సర్వులను సమైక్యంగా జీవింపచేసే మహత్తర శక్తి ఈ నదులకు ఉంది.

ఏవిధంగా? ........

దానికి నిదర్శనమే వి.హిం.ప చేపట్టిన ఏకాత్మతాయజ్ఞం అలాగే కుంభమేళలు పుష్కరాలు...... మానవుని భౌతిక, ఆర్థిక, ఆధ్యాత్మిక జీవితంలో కూడా ప్రధాన పాత్ర వహిస్తున్న ఈ నదులు లేకపోతే మానవ జీవితం ఎడారి అవుతుంది.

# నదుల పవిత్రత - ప్రయోజనాలు

మనం దేవతలను పూజించే ముందు పవిత్రమైన నదులలో స్నానమాచరించుతారు. ఈ కారణంగానే పుణ్యతీర్థాలన్ని నదుల ఒడ్డుననే వెలిసాయి. ఈ పుణ్యతీర్థాలను దర్శించుటాన్ని తీర్థాటన అంటారు. తీర్థ అంటే సంస్కృతంలో దాటుట అని అర్థం. అంటే ఈ నదులలో స్నానం చేసి మనం ప్రాపంచిక విషయాలను దాటి అధ్యాత్మిక విషయాలపై మనస్సు లగ్నం చేస్తాము.

## ప్రత్యేకత

నదులలోని నీరు ఒకటి గానే కనిపించిన ఆ నీటిలోని రసాయనిక గుణాలు వేర్వేరుగా ఉంటాయి. గంగానదిలో నీరు కలరా క్రిములను నాశనం చేస్తుందని శాస్త్రజ్ఞాలు కనుగొన్నారు. ఈ నదులు ప్రవహించే మార్గంలో నిక్షిప్తమై ఉన్న అనేక ఖనిజాలు ఈ నీటిలో కరిగి పోవడమే దీనికి కారణం.

ఈ నదులు వివిధ రకాల ఇసుక పొరలు కల్గి ఉంటాయి. ఈ పొరలలో బంగారం , వెండి, రాగి లాంటి ఖనిజాలు కూడా లభ్యమవుతాయి. ఇవి నీటిలో కరిగి అనేక రోగాలను నాశనం చేస్తాయి. వివిధ నదులలో స్నానం చేస్తే శరీరం రంగులో కూడా కొద్ది మార్పు కనిపిస్తుంది.

గంగానదిలో స్నానం చేస్తే తెల్లగా, యమునలో స్నానం చేస్తే లేతనీలం గోమతిలో స్నానం చేస్తే నల్లగాను మారుతారంటారు. ఈ సూక్ష్మమైన మార్పులు శరీరం పై ఏర్పడడం మూలాన చర్మం మృధువుగాను, ఆరోగ్యంగాను ఉంటుంది.

అనేక కొండలలో నుంచి ప్రవహించే నదులు వివిధ రకాల ఔషధాల లక్షణాలను మరియు రాళ్ళను తనలో కరిగించుకోవడం మూలాన వివిధ రకాలైన ప్రత్యేక వైద్య లక్షణాలను కలిగి వున్నాయి.

ఒక్క హిమాలయ ప్రాంతంలోనే 20 వేల రకాల అమూల్య ఔషధ మూలికలున్నాయట.

## ప్రయోజనాలు

నీరు సహజ సంపద మరియు ఇది పునఃపూరకము. నీరు ద్రవ రూపంలో ప్రవహిస్తున్న బంగారం. ఈ సహజ సంపద అపారంగా కలిగిన దేశం మన భారత దేశం. ప్రపంచంలో ప్రవహించే ఈ ద్రవరూప బంగారంలో 7వ వంతు మన దేశంలోని నదులలోనే ప్రవహిస్తుండటం మన జాతి అదృష్టం.

నదుల ద్వారా, వర్షంద్వారా మొత్తంమీద 42 కోట్ల హెక్టార్ అడుగుల నీరు భారత భూభాగంపైకి చేరుతుంది. దీనిలో కొంత ఆవిరికాగా మరికొంత ఇంకి పోగా నికరంగా 18 కోట్ల హెక్టార్ అడుగుల నీరు ప్రవహిస్తుండగా ఇందులో కేవలం 2 కోట్ల హెక్టార్ల అడుగుల నీరు మాత్రమే రిజర్వాయర్లలో నిలువ చేసి మనం వాడుకుంటున్నాము. మిగతా 16 కోట్ల హెక్టార్ల అడుగుల నీరు వృధాగా సముద్రంలో కలుస్తున్నది.

## దుర్భిక్షం - సుభిక్షం

మన దేశంలోని నీటిలో 70% నీరు ఉత్తరాది నదులలో ప్రవహిస్తున్నది. కాని సగ భూభాగం మాత్రమే ఆ ప్రాంతానిది. మిగతా సగ భూభాగం అయిన దక్షిణ భారతంలో 30% నీరే ప్రవహిస్తుంది. మన దేశంలో ప్రతీ ఏటా $2\frac{1}{2}$ కోట్ల ఎకరాల భూమి వరదలకు గురి అవుతుందని మరో

[redacted] 10 కోట్ల ఎకరాల భూమి వరదలకు గురయ్యే ప్రమాదం ఉందని వరదలపై నియమించిన జాతీయ కమీషన్ వారు హెచ్చరించారు.

130 సం. క్రింతవు నాటి సర్ ఆర్ధర్ కాటన్ సూచనను గాని, డా. కె.యల్.రావు సూచనలను గాని, డాక్టర్ దిన్‌షా జె దస్తూర్ పథకాన్ని గాని మనం త్వరితంగా అమలు చేస్తే దుర్భిక్ష ప్రాంతాలన్నీ సుభిక్షమవుతాయనడం నిర్వివాదాంశం.

అందుకే ..........

భారతీయులు ఈ నదులను మాతృదేవతలుగా ఆరాధిస్తారు. అనునిత్యం భక్తి భావంతో ఈ విధంగా స్మరించుకుంటుంటారు.

గంగేచ యమునేచైవ
గోదావరి సరస్వతీ!
నర్మదే సింధు కావేరి
జలేస్మిన్ సన్నిధింకురు!!

మరియు ..........

గంగా సరస్వతీ సింధుర్
బ్రహ్మపుత్రశ్చ గండకీ!
కావేరీ యమునా రేవా
కృష్ణా గోదా మహానదీ!!

## ముందుగా!

అత్యద్భుతమైన పరమ పావనమైన మన భారత మాత యొక్క పాదపద్మముల చెంత నత మనస్కులమయి ప్రణమిల్లి తర్వాత భవ్యమైన

దివ్యమైన, దేదీప్యమానమైన మన "మాత" యొక్క రూపాన్ని దర్శించుకుని పవిత్రమవుదాం!

## కన్యాకుమారి:-

- భారత మాత పాద పద్మము ఇది ఒక పవిత్రమైన అతి ప్రశస్తమైన ఎంతో సుందరమైన ప్రదేశము.
- శ్రీ కుమారిదేవి దివ్య స్వరూపం తపస్థితిలో ఉన్నట్లు ఇక్కడి మందిరంలో ఉంది.
- విశ్వమత సభలో హిందూ ధర్మ వైశిష్ట్యాన్ని వైభవాన్ని, విశాలత్వాన్ని చాటిచెప్పి, విశ్వంలో విశిష్టమైనది శాశ్వతమైనది కేవలం "హిందూ ధర్మం" మాత్రమేనని మెప్పించి వచ్చిన భారత మాత ముద్దుబిడ్డ, మన పూర్వజుడైనస్వామి వివేకానందకు మొదటగా కర్తవ్యాన్ని, సందేశాన్ని అందించిన పవిత్ర స్థలం ఇదే, " వివేకానంద రాక్ మెమోరియల్" ఇక్కడే ఉంది, నేడది ప్రపంచ పర్యాటక స్థలాల్లో ఒకటి.

## సాగర త్రయ సంగమస్థలి:-

హిందూ, సింధూ, గంగా సాగరాలు సంగమించే పవిత్ర స్థలం ఇదే.

సూర్యోదయాస్తమయాలు స్పష్టంగా అత్యంత రమణీయంగా ఇక్కడి నుండి మాత్రమే దర్శించుకోవచ్చు.

# గంగానది

మన పవిత్రమైన నదీమ తల్లుల్లో అతి ప్రశస్తమైనది గంగానది.

## గంగానది:-

గంగ పేరు చెప్పగానే భారతీయుని హృదయం భక్తితో, ఆవేశంతో, ఆనందంతో పులకించి పోతుంది. పవిత్రతకు మారు పేరు గంగాజలం, పాపాలను క్షాళనం చేసేది గంగాజలం, ఆరోగ్యప్రదాయిని గంగాజలం, యుగయుగాల గంగమ్మ తల్లి పట్ల మనందరిలో ఆరాధన భావం సహజంగా పొంగిపొరలుతుంది.

## గంగావతరణ కథ:-

అయోధ్యను సగరుడనే చక్రవర్తి పరిపాలించేవాడు. ఆయన గొప్పతపస్సు చేసి 60వేల మంది బలాఢ్యులైన కుమారులను పొందాడు. సగరుడు అనేక అశ్వమేధ యాగాలు చేసాడు. ఒకసారి యాగాశ్వం వెంట తన కుమారులందరినీ పంపించాడు. ఆయాగాశ్వం దేశ దేశాలు తిరిగి సముద్రంలో అడుగు పెట్టగానే నీరు ఇంకిపోయింది. అప్పుడే ఇంద్రుడు ఆ అశ్వాన్ని దొంగిలించి కపిల మహర్షి ఆశ్రమంలో కట్టివేసాడు. అశ్వం కోసం భూమంతా వెదికి చివరికి 60వేల మంది 60వేల పొడవు వెడల్పు గల సముద్రభూమిని తవ్వారు అప్పటికీ అశ్వం కనిపించలేదు వాళ్ళు అదే విధంగా త్రవ్వుతూ వెళ్ళగా "రసాతలం" అక్కడ మహాతేజస్సుతో వెలిగిపోతున్న కపిలముని, సమీపంలో కట్టివేయబడ్డ యాగాశ్వం కనిపించగా మహర్షియే అశ్వాన్ని దొంగిలించాడనే భావంతో ఆయనకు అపకారం తలపెట్ట ప్రయత్నించారు సగర పుత్రులు. తన తపోనిష్ఠకు భంగం కలిగించిన వారివైపు తీక్షణంగా చూసారు మహర్షి. వారు భస్మమైనారు.

సగరుడు ఆయన మనుమడైన అంశు మంతుడు, అంశు మంతుని కుమారుడైన దిలీపుడు, వీరంతా తమ పితరులను ఉద్ధరించడానికి ప్రయత్నించి విఫలురైనారు. చివరగా దిలీపుని కుమారుడైన భగీరథుడు

వేలాది సంవత్సరములు భయంకర తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి రెండు వరాలు కోరుకున్నాడు. గంగానదీ జలాలు నాపూర్వజుల బూడిదపైన ప్రవహించాలని, నావంశాభివృద్ధి జరుగాలని, అప్పుడు. బ్రహ్మ, శంకరున్ని ప్రత్యక్షం చేసుకో ఆయన అనుగ్రహం పొందు. అప్పుడు గంగ భూమిపైకి వస్తుంది. అని భగీరథునితో చెప్పి, గంగాదేవితో నీవు భగీరథుడు కోరినప్పుడు అతని వెంట వెళ్ళు. అని అంతర్ధానమైనాడు బ్రహ్మ!

భగీరథుడు రెండు చేతులు పైకెత్తి ఒకకాలి బొటన వ్రేలు పైన నిలబడి శివుని గూర్చి భయంకరమైన తపస్సాచరించగా శివుడు ప్రత్యక్షమై గంగను తన శిరస్సున ధరిస్తానని శివుడు అనుగ్రహించగానే భగీరథుని అభీష్టం తీర్చడానికి గంగా ఆకాశం నుండి మహావేగంతో శివుని శిరస్సుపైకి దూకింది. గంగకు గర్వభంగం చేయనెంచి ఆమెను శివుడు తన జటామండలంలో బంధించాడు. సంవత్సరాల తరబడి గంగ అందులోనే సుళ్ళు తిరుగుతూ ఉండాల్సి వచ్చింది. భగీరథుడు మళ్లీ తపస్సు చేయగా శివుడు సంతోషించి గంగాధారలో ఒక పాయను బ్రహ్మదేవుడు నిర్మించిన బిందుసరోవరం అనే సరస్సులో విడువగా గంగ పాయలై, హ్లాదిని, పావని, నళిని అను మూడు ధారలు తూర్పుకు, సుచక్షువు సీత, మహానది అగు సింధువు పశ్చిమదిశగా మిగిలిన ఏడవది "గంగ" భగీరథుని అడుగుజాడల ననుసరించింది. మార్గమధ్యంలో జహ్నుడనే మహాముని ఒకయాగం చేసుకుంటుండగా అమిత వేగంతో వస్తున్న గంగ ఆయన యాగశాలనంతా ముంచివేయగా జహ్నువుకు కోపం వచ్చి గంగా జలాన్నంతా త్రాగివేసాడు. అప్పుడు భగీరథుడు, దేవతలు మునులంతా ప్రార్థించగా జహ్నువు తన చెవి నుండి గంగను బయటకి విడిచాడు.

తర్వాత గంగానది సముద్రం దాక ప్రవహించి పాతాళం ప్రవేశించి సగరపుత్రుల భస్మరాసులపై ప్రవహించింది. వారంతా దివ్యదేహాలు ధరించి స్వర్గం చేరుకున్నారు. భగీరథుడు వారందరికి గంగాజలంతో

తర్పణాలుగావించాడు ఆ విధంగా గంగానది భగీరథుని వల్ల భువికి తేబడింది కనుక భాగీరథి అని, జహ్నువు చెవి నుండి బయటకు వచ్చింది కనుక జాహ్నవి అని స్వర్గ మర్త్య పాతాలలో ప్రవహించింది గనుక 'త్రిపధగా' అను పేర్లతోను విలసిల్లింది. ఈ విధంగా ఎవరికీ సాధ్యంకాని కార్యాన్ని సాధ్యం చేసాడు భగీరథుడు. దీనివల్లనే భగీరథ ప్రయత్నం అనే నానుడి ఏర్పడింది.

## ప్రస్తుత గాధ:-

భారత భూమిపై గంగ గూర్చి తెలుసుకుందాం:- గంగ ఒకజల ప్రవాహంకాదు. ఒక మాత ఒక దేవత దివి నుండి భువికి దిగి వచ్చిన దేవతామూర్తి.

అంతేకాదు ........

యుగయుగాలుగా మహర్షుల తపోభూమి గంగాతీరం, ప్రాణధారను ప్రసాధిస్తున్న నది గంగ, సాగు నీటికి రవాణాకు మహోత్తర సాధనం గంగ. గంగ ప్రజల వెన్నెముక.

## ఉద్గమ స్ధలం:-

గంగోత్రి వద్ద మంచు కొండల నుండి ఉద్గమిస్తున్న గంగను భాగీరథి అంటారు. అక్కడ గంగకు కొండవాగు కుండే ఉధృతం ఉంటుంది. మెలికలు తిరుగుతూ ఉరకలు వేస్తూ సురుగులు క్రక్కుతూ, సుళ్లు తిరుగుతూ కొండరాళ్ళను ఒరుసుకుంటూ, బండలను చీల్చుకొంటూ మహావేగంతో విజృంభిస్తుంది.

## గంగా పరివాహ ప్రాంతం:-

ఉత్తర ప్రదేశ్‌లోని ఉత్తర ఖండ్ జిల్లా దేవ ప్రయాగంలో ఈ నదిని గంగ అని పిలుస్తారు. అక్కడే భాగీరథి, అలకానంద సంగమం పొంది గంగానదిగా రూపొంది "రుషీకేశం"లో గంగ కొండల నుండి క్రిందకు దిగుతుంది. "హరిద్వారం" వద్ద గంగ మైదాన ప్రాంతంలో ప్రవేశిస్తుంది. ఈ విధంగా రుషికేశ్ హరిద్వార్ ప్రాంతాలు గంగతో ముడివడి పవిత్రతను సంతరించుకున్నాయి. ఈ రెండు పట్టణాల మధ్య దూరం సుమారు 10 మైళ్ళు. ఈ ప్రాంతంలో అనునిత్యం గంగానదిలో వేలాది మంది స్నానాలు చేసి పవిత్రతను పొందుతూ, శివకేశవుల భజిస్తూ, కబీర్, మీరాల భజనలతో తన్మయులవుతూ, పూలతో, దీపాలతో నిండిన దొన్నెలను నదిలో వదలుతుంటారు. ఆ దొన్నెలు ప్రవాహంలో తేలియాడుతుంటే చూచి భక్తులు, భావుకులు పరివశించిపోతారు.

## హరిద్వార్:-

గంగ హరిద్వార్ వద్ద నుండి ఎగువ గంగ దిగువగంగ అనే పాయల ద్వారా 11,120 మైల్లు ప్రవహిస్తూ 22 లక్షల ఎకరాల భూమిని సస్యశ్యామలం చేస్తున్నది.

## త్రివేణీ సంగమం:-

గంగ ప్రయాగకు చేరేటప్పటికి ప్రవాహ వేగం తగ్గుతుంది అక్కడే యమునా నది వచ్చి గంగలో కలుస్తుంది. అంతర్వాహినియైన సరస్వతీ నది కూడా కలుస్తుంది. త్రివేణి సంగమస్థలి పరమ పావనం, ఇందులో స్నానం సర్వపాపహరణం. ఈ స్థలం (ప్రయాగ) తీర్థరాజంగా ప్రసిద్ధిచెందింది.

వారణాసి:-

వారణాసి వద్ద గంగ ఉత్తరగామిని అవుతుంది. అంటే అంత వరకు ఉత్తరం నుండి దక్షిణానికి ప్రవహిస్తూ వచ్చిన గంగ ఇక్కడి నుండి దక్షిణం నుండి ఉత్తరం ప్రవహించడం ప్రారంభిస్తుంది. వారణాసిలో శరీరం వదిలితే జీవన్ముక్తి లభిస్తుందనేది తరతరాలుగా వస్తున్న నమ్మకం, వారణాసి ప్రాధాన్యం అదే. అందుకే మన పూర్వులు "కాశ్యాంతు మరణాన్ముక్తిః" అని కీర్తించారు.

వారణాసి నగరం తరతరాలుగా వేద విద్యకు నిలయం. ఆధునిక యుగంలో పండిత మదనమోహనమాలవీయ అక్కడ కాశీ హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించి దానిని సాంకేతిక విద్యకు కూడ నిలయంగా మార్చాడు.

వారణాసిని వదల లేక వదిలిన గంగ గయకు చేరుతుంది. గయకు 7 మైళ్ళ దూరంలో బుద్ధగయ ఉంది ఇది బుద్ధుని జీవితంతో పెన వేసుకున్న పట్టణం.

గయ నుండి గంగ రెండు పాయలు అవుతుంది. ఒక పాయ బంగ్లాదేశ్ గుండా ప్రవహిస్తుంది. రెండవ పాయ ముర్షిదాబాద్ బంద్రానాగూర్‌ల మీదుగ కలకత్తా చేరుతుంది. బంగ్లాదేశ్ లో గంగ బ్రహ్మపుత్రతో కలిసి "పద్మా" నదిగా పిలువబడుతుంది.

ఆ అద్భుతమైన వాస్తవానికి కారణమేమిటో ఇంకా ఖచ్చితంగా తెలియలేదు. మలేరియా వ్యాధిని అరికట్టడానికి, దోమలను అరికట్టడానికి పట్టణాలకు గంగా జలాన్ని సరఫరా చేయాలని M.R.C. బృందం విజ్ఞప్తి చేసింది. గంగా జలం స్వచ్ఛమైందని ఈనదిలో నీరు దానంతటదే శుభ్రపడుతుందనీ అతిప్రాచీన కాలం నుండి మనకున్న విశ్వాసం నిజమని ఆ పరిశోధనల వల్ల నిరూపితమైంది.

ఢిల్లీ:-

ఢిల్లీలో 131 వోవర్ హెడ్ టాంకులకు గంగానది జలాలు సరఫరా అవుతాయి. ఈ టాంక్‌లను సర్వే చేస్తే ఏ ఒక్క టాంక్‌లోను దోమలకు సంబంధించిన లార్వా కనిపించలేదు.

976 టాంకులకు యమునా నీరు సరఫరా అవుతుంది వీటిని సర్వే చేస్తే 14 టాంకులలో దోమల లార్వా కనిపించింది.

ఈ పరిశోధన బృందం మీరట్ బులందర, షహర్ జిల్లాలోని 150 కి.మీ. గంగా పరీవాహక ప్రాంతంలోనూ ఘజియాబాద్ జిల్లాలోని గంగా కాలువ వెంబడి పరిశోధనలు చేసింది. మొత్తం 14గ్రామ ప్రాంతాలలో 3,196 గుంటలు, బావులలోని నీటిని పరిశీలించారు. ఎక్కడ దోమల లార్వా కనిపించలేదు.

గంగా జల ఈ విశిష్టతకు కారణమైన రసాయన, జీవశాస్త్ర అంశాల గురించి ఇంకనూ పరిశోధనలు కొనసాగించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

M.R.C. డైరెక్టర్ డా. వి.పి. శర్మ నాయకత్వంలో డా. బి.న్. నాగపత్ డా. సూతన్‌నందాన్ మొదలగు వారు ఈ పరిశోధనలు చేసారు. ఇంకను గంగా జలం యొక్క ప్రత్యేక ప్రాశస్త్యానికి సంబంధించిన అనేక విషయాలు

వెలుగులోకి వచ్చిన నాడు హిందువుల యొక్క వాస్తవ దృక్కోణం విశ్వానికి అవగత మవుతుంది.

పొడవు:- 1650 మైళ్ళు నీరు అందిస్తుంది. 22 లక్షల ఎకరాలకు.

పరివాహ ప్రాంతం:- భారత దేశ భూభాగ పరిమాణంలో "నాల్గవ" వంతుంటుంది. 30 లక్షల చ.మైళ్ళ ప్రాంతం ఇది అత్యంత సారవంతమైనది.

# సింధూనది

ఈశాన్య దిక్కున ప్రవహించే గొప్ప నదులలో ఒకటి సింధూనది. ఇది టిబెట్ నుండి ఉధృతంగా ప్రవహించి కాశ్మీర్ గుండా పయనిస్తూ పంజాబ్‌లో ప్రవేశించి చివరగా అరేబియా సముద్రంలో కలుస్తుంది. దీని జన్మస్థలం మహోన్నత హిమాలయాలపై నున్న మానస సరోవరం. ఈప్రదేశం నుండి బ్రహ్మపుత్ర సట్లైజ్ మొదలైన నదులు ఆవిర్భవించాయి.

## సింధువు:-

అంటే కేవలం నది మాత్రమే కాదు. సముద్ర మనికూడా అర్థం. దీన్నే "ఇండస్" అని కూడా పిలుస్తారు.

దీని డ్రైనేజి బేసిన్ 3,72,700 చదరపు మైళ్ళు హిమాలయాల నుండి ఈశాన్యం దిక్కుగా. 160 K.m. ప్రవహించే ఈ నదిని "సింగ్-గా-బాబ్" అనే పేరుతో పిలుస్తారు. అక్కడి నుండి వాయువ్యదిశగా ప్రవహిస్తూ కాశ్మీర్‌లో ప్రవేశించిన మీదట దాని ప్రవాహం వేగం తగ్గుతుంది. తర్వాత బెలుచిస్తాన్ చేరుతుంది. దానికి ముందుగా షియోక్ నది దీనిలో కలుస్తుంది. తర్వాత లక్కర నదిని కలుపు కుంటుంది కారకోరం పాస్ నుండి ప్రవహిస్తుంది.

సింధు అనే సంస్కృత పదం నుండి సింధూ, ఇండస్ అనే పదాలు వచ్చాయి. భారతీయులు దీన్ని "సింధు" అని పిలుస్తారు. సింధూనది యొక్క డెల్టా ప్రాంతము 3,000 చ.మైళ్ళ విస్తీర్ణం. 125 మైళ్ళ తీరప్రాంతం కలిగి ఉంది.

హరప్పా శిథిల నగరంపై నుండి సింధూ నది ప్రవహిస్తుంది. మొహంజోదరో సింధ్ లోని "లఖారా" జిల్లాలో ఉంది. సుమారు 3,4 వేల సంవత్సరముల క్రితమే ఈ ప్రాంతంలో ప్రజలు నివసించినట్లు తెలుస్తుంది. 1922లో డా. R.D. బెనర్జీ ఈ ప్రాంతంలో పరిశోధనలు జరిపారు. ఈ ప్రాంత నివాసులు పశుపతి నాధున్ని పూజించే వారు. బ్రహ్మలిపికి ఈ ప్రాంతం మాతృస్థానం. వాణిజ్యం, సాహిత్యం, సాంకేతిక, సాంస్కృతిక వ్యవసాయ తదితర అన్ని రంగాలలో కూడా గణనీయమైన ప్రగతిని సాధించినది. ప్రపంచంలోని పలుదేశాలతో వ్యాపార సాంస్కృతిక సంబంధాలుండేవి. సప్తసింధువులో ఒకటి ఈనది. ఆ నదీమతల్లి తీరాన, పూర్వ ఋషులు తమ తపో దృష్టితో వేదాలను దర్శించారని కొందరు ప్రాజ్ఞులు అంటారు.

పొడవు:- 1800 మైళ్ళు

డెల్టా ప్రాంతము:-3000 చ.మైళ్ళు

తీర ప్రాంతము:-3,72,700 చ.కి.మి.

# బ్రహ్మపుత్ర

సప్తసింధువులలో ఒకటి యైన ఈ నదిని ఐతిహాసికంగా లోహిత్య అని పిలుస్తారు. ఇది ప్రపంచంలోని అతిపెద్ద నదులలో ఒకటి ఇది టిబెట్ నుండి భారత దేశం, బంగ్లాదేశల గుండా దాదాపుగా 2500కి.మి ప్రాంతాన్ని

సారవంతం చేస్తూ మన దేశంలోని అస్సాం ప్రాంతాన్ని రెండుగా చీలుస్తూ బంగాళాఖాతంలో కలుస్తుంది.

## జన్మస్థలము:-

టిబెట్ లోని 5,150 మీటర్ల ఎత్తున ఉన్న ఉత్తర హిమఖండము నుండి పుట్టింది. టిబెట్ లో దీనిని " ట్యాంగ్‌పో" అని అంటారు.

## భారత్‌లోకి:-

ఆ నది మొదట "సర్ధయా" అనే పట్టణము దగ్గర భారతదేశములోకి ప్రవహించి ఆతర్వాత అస్సాంకనుమల్లోకి ప్రయాణిస్తుంది. 'గోల సర' అనే ప్రాంతంలో బంగ్లాదేశ్‌లోకి ప్రవేశించి బంగ్లాదేశ్‌లోని గోనలుంద అనే ప్రాంతంలో గంగానదిలో కలుస్తుంది. అక్కడ దానిని "పద్మ" అని పిలుస్తారు. 105 కి.మీ దూరం ప్రవహించి "మేఘ్న" అనే మరో నదితో కలిసి బంగాళాఖాతంలో కలుస్తుంది. భారత్‌లో బ్రహ్మపుత్రానది ముఖ్యమైనది.

బీహార్, బెంగాల్, అస్సాంలకు, నౌకాయాన సర్వీసులు నడిచేవి (బ్రిటీష్ వారి కాలంలో) బ్రహ్మపుత్ర నదికి దాదాపు 120 ఉపనదులున్నాయి.

## పురాణ ప్రాశస్త్యము:-

కలి పురాణం:- కలిపురాణంలో మాతృహత్యాపాప పరిహారం కొరకు బ్రహ్మ గుండంలో స్నానం చేసి లోక కళ్యాణార్థం అకుందము యొక్క తూర్పు భాగాన్ని తన పరుశువు చేత ఖండించడం ద్వారా ఆ నీరు "కామరూపము" అని పిలువబడే నేటి అస్సాం వైపు ప్రవహింపచేయడం సాధ్యమైందని ఉన్నది. దానినే పరుశురామ తీర్థం అని వ్యవహరిస్తారు.

మహాభారతంలో కూడా దాని గురించి చెప్పబడింది.

## యోగినీ తంత్రం:-

యోగినీ తంత్రములో ఈ తీర్ధంలో స్నానం సర్వపాప హరణం అని చెప్పబడినది.

బ్రహ్మపుత్రానది మధ్యలో భస్మాచలం ఉంది. అక్కడే పరమ శివుడు మన్మధున్ని భస్మం చేసాడని, పార్వతికి జ్ఞానోదయం చేసాడని చెవుతుంటారు.

## ఊర్వశి కుండము:-

మాఘమాసంలో ఈ గుండంలో స్నానం చేస్తే అశ్వమేధయాగ ఫలం వస్తుందట.

## భౌతిక సంపదల బ్రహ్మపుత్ర:-

బ్రహ్మపుత్రదాని ఉపనదులు ప్రవహిస్తున్న స్థలం అపార ఖనిజ సంపదకు నిలయమై ఉన్నది. అస్సాంలో 'ది ఇంగ్ ప్రాంతం నుండి బంగాళాఖాతం వరకు "నూనె" సమృద్ధిగా ఉంది దీనినే "కోల్ మెజర్స్" అని కూడా పిలుస్తారు. అంతేకాక బ్రహ్మపుత్రానది దాని ఉపనదులలో బంగారము మరియు ప్లాటీనం కూడా విశేషంగా ఉన్నదని పరిశోధకులు తెలుపుతున్నారు. ఆనది అస్సాం రాష్ట్రం చుట్టూ ప్రవహిస్తుంది.

పొడవు: 1680 మైళ్లు లేక 2500 కి.మి.

5,80,000చ.కి.మి భూభాగాన్ని సారవంతం చేస్తున్నది.

పరివాహ ప్రాంతాలు:- టిబెట్, హిందూదేశం, బంగ్లాదేశ్.

# యమున

## భూప్రవేశం:-

ఉత్తర్ ప్రదేశ్‌లో టెహ్రిగార్వల్ జిల్లాలో గల యమునోత్రి హిమపర్వతాలలో నుండి 5,300 మీ. ఎత్తు నుండి ప్రవహిస్తుంది. ఉత్తర ప్రదేశ్ లోని సహారాంపూర్ జిల్లా ఫైజాబాద్ సమీపంలోని పర్వతాల్లోంచి 1,3,76 కి.మి. దూరం ప్రవహించి ఒక మనోహరమైన రూపంతో అలహాబాద్ జిల్లాలో ప్రయాగ వద్ద గంగానదిలో విలీన మవుతుంది.

## కాళిదాసు కల్పన:-

భారతీయ ప్రసిద్ధ సంస్కృత కవి కాళిదాసు అత్యంత శోభాయమానము సుందరమూ అయిన ఆ సంగమాన్ని వర్ణిస్తూ....... గంగాయమునా జలాలు సంగమ మౌతున్న వేళ చూస్తుంటే స్ఫటికాలు వజ్రాలు ఒక దారానికి గ్రుచ్చి నట్లు, తెల్లని హంసల గుంపు ఒకటి బిరిబిరా నల్లనల్లని మరొక హంసల గుంపులోనికి చేరిపోతున్నట్లు, తెల్లని కలువ మొగ్గల హారంలో నీలికలువలు పొదిలినట్లు, వెలుగు రేఖలు చీకటి తెరల్లో కరిగిపోతున్నట్లు, నీలాకాశంలో శరద్ మేఘాలు మొలచినట్లు కన్పిస్తుంది అన్నారు.

## పురాణ ప్రాశస్త్యం:-

క్షీర సాగర మధనం సమయంలో ప్రయాగ, హరిద్వార్, నాసిక్, మరియు ఉజ్జయిని ప్రాంతాలలో అమృత భింధువులు పడ్డాయని అమృత భాండాన్ని రాక్షసుల బారి నుండి రక్షించి విష్ణువు దేవతలకు అందించాడని

మన ఇతిహాసాలు చెపుతున్నాయి. కనుక గంగ ,యమున, సంగమస్థలిలో ప్రతి సంవత్సరము మాఘమేలాలో కోట్లాది మంది ( 12సం. కొకసారి వచ్చే కుంభమేళలో కూడా) అన్నింటికి అతీతంగా సమైక్య భారత రూపాన్ని అక్కడ సందర్శిస్తారు.

## యమునోత్రి:-

యమునోత్రి హిమాలయాల్లోని బందర్ పూంచ్ శిఖరానికి పశ్చిమ దిక్కున 6,135 మీ. ఎత్తున ఉంది అది నిరంతరం మంచుతో కప్పబడి ఉంటుంది. అక్కడికి వెళ్ళడం సాధ్యంకాదు. లంకాదహనం తర్వాత హనుమంతుడు తన తోకను యమునోత్రిలో చల్లార్చుకొన్నందున ఈ ప్రాంతానికి "బందర్ పుంచ్" అని పేరు వచ్చిందంటారు.

## యమునోత్రి ధామము:-

3,915మీ. ఎత్తున ఉంది ఇది ఒక చక్కని యాత్రా స్థలం. ఇక్కడ 'అసిత' మహాముని ఆశ్రమం ఉండేదని ఆయన రోజు యమునోత్రిలో మరియు గంగోత్రిలో స్నానం చేసే వాడంటారు.

"తప్తకుండ" ( **Sulpher Springs**) అనగా వేడి నీటి గుండము, ప్రయాణంతో అలసి పోయిన ప్రయాణికులు ఆ వేడి నీటి గుండంలో స్నానం చేసి "యమునామాయి" అలయాన్ని సందర్శిస్తారు. అమ్మవారి ప్రక్కనే ఒక దివ్యశిల దానికి రెండు రంధ్రాలున్నాయి వాటి గుండా వేడినీరు ఆవిరిని ( Gayser) విరచిమ్ముతూ ఉంటుంది. వానిని యమునా మాతకళ్ళుగా భావించి పూజిస్తారు.

"సూర్యకుండ్" అది నిరంతరం మరుగుతూ ఉండె నీటి గుండము ఒక గుడ్డలో బియ్యంకట్టి 5నిమిషాలు అనీటిలో ఉంచితే అన్నం తయారవుతుంది. దానిని యమునా ప్రసాదంగా స్వీకరిస్తారు.

## మధుర:-

శ్రీ కృష్ణుడి జన్మస్థానం మధుర, పెరిగినది బృందావనం ఈ రెండు యమునా తీరంలో ఉన్నాయి. మహాభారత కాలంనుండి మౌర్యులు, గుప్తులు, హర్షులు మహ్మదీయులు, బ్రిటీష్ పాలనలకు, కురుక్షేత్రం పానీపట్ తదితర చారిత్ర యుద్ధ స్థలాలు, ఢిల్లీ, ఆగ్రా తదితర నగరాలు యమునా పరీవాహ ప్రాతంలోనివే.

## యమునా వ్యవసాయం:-

యమునా ఉత్తరప్రదేశ్ వ్యవసాయ క్షేత్రాన్ని సస్యశ్యామలం చేస్తుంది.

## తూర్పుయమున:-

( 17-19-1748) నిర్మించబడినది. దీని పొడవు 206 కి.మి.

2 లక్షల, హెక్టార్లకు నీరు అందిస్తుంది.

## పడమటి కాలువ:-

( 19వ, శతాబ్ధంలో నిర్మించబడినది) 5,32,600 హెక్టార్లకు నీరు అందిస్తుంది.

ఆగ్రాకాలువ:- 267 కి.మీ. పొడవు 1లక్ష 67వేల 450 హెక్టార్లకు నీరందుతుంది.

డూన్‌కాలువ ద్వారా:- 11,280 హెక్టార్లకు నీరందిస్తుంది.

యమునా నది పరివాహ ప్రాంతాల్లో కొన్నింటిని చైనా పరిశోధకుడు హుయాన్‌త్సాంగ్ హర్షవర్ధనునితో కలిసి సందర్శించాడు అదే విధంగా పాహియన్ కూడా కొన్ని ప్రాంతాలని సందర్శించాడు. వారిరువురు భారతవైభవాన్ని కన్నులారాగాంచి తమ గ్రంధాలలో మన దేశాన్ని కీర్తించారు.

# నర్మద

## ప్రస్తావన:-

మహాభారతంలోని వనపర్వంలోను, స్కంధ పురాణంలోని రేవా కాండ లోను నర్మద ప్రస్తావన ఉన్నది.

## ఉద్గమ స్తలం:-

నర్మదానది మధ్యప్రదేశ్‌లోని వింధ్య సాత్పురా పర్వత శ్రేణికి తూర్పు భాగాన గల మేఖల శ్రేణి యందుగల "అమరకంటకము" అను చోట మొదలైంది దీని ఎత్తు 3,500 అడుగులు.

## పరివాహప్రాంతం:-

వింధ్య సాత్పురా పర్వత శ్రేణికి మధ్యగా సుమారు 500 మైళ్లు ప్రవహిస్తుంది. అపైనా హేనడియా పట్టణం వరకు 200 మైళ్ళు ప్రయాణించి మాల్వా మీదుగా గుజరాత్‌లో ప్రవేశించి 180 మైళ్ళు ప్రయాణించి సముద్రం చేరుతుంది. ఈ నది దాదాపుగా 1060 మైళ్ళు ప్రవహించి సింధూసాగర్‌లో కలుస్తుంది. సముద్రం వద్ద దీని వెడల్పు 17 మైళ్ళు

ఉంటుంది. మద్రాసు నుండి ఢిల్లీ వెళ్ళేవారు తప్పనిసరిగా ఈ నర్మదా నదిని దాటవలసిందే. ఈ నది పొడవున అనేక పుణ్యక్షేత్రాలున్నాయి.

### పౌరాణిక ప్రాశస్త్యము:-

పద్మపురాణంలోని ఆదికాండంలో పుణ్యతీర్థాలలో నర్మదానని ప్రస్తుతిస్తూ 13 వ, అధ్యాయంలో 54 శ్లోకాలున్నాయి. నర్మదానది అంతటా పవిత్రమైనదనీ వశిష్టుడు దిలీపునికి చెపుతాడు. అనేక తీర్థాలు శివాలయాలున్న అమరకంటకం వద్ద శివుడు ఏదో ఒకరూపంలో నిత్యం కనపడుతుంటాడని ప్రతీతి.

## సరస్వతి

### పౌరాణికం:-

బ్రహ్మవైవర్తపురాణం,లో ఈ నది ప్రస్తావన ఉన్నది. ఋగ్వేదములో కూడా ఈ పవిత్రనది కీర్తించబడినది. భాగవతంలోకూడా దీని గురించి చేప్పబడింది.

### ఉద్గమస్థలం:-

5లక్షల సంవత్సరముల క్రితం హిమాలయాలలోని శివాలిక్ పర్వత (సిమ్లాదగ్గర) పంక్తులలోని "ప్లక్షప్రస్రమాగిరి" మీద పుట్టింది. వేదోక్త నదీ మయమైన సరస్వతీ, కొంత దూరం పైకి కనిపిస్తూ, తర్వాత అదృశ్యమవుతూ తిరిగి వేరేచోట కన్పిస్తూ వుంటుంది. కనుక దీనిని "అంతర్వాహిని" అని అంటారు. ప్రయాగ వద్ద సరస్వతీ అంతర్వాహినియై గంగ యమునలతో కలుస్తుంది.

## ప్రాచీన వివరాలు:-

బిందుసారుని ఆశ్రమం ఆ నదీ ఒడ్డున ఉన్నదని భాగవతం పేర్కొన్నది. మొదటి చక్రవర్తియైన పృథు అనేక జనపదాల్ని ఈ నదీ తీరాన స్థాపించాడని ఈ నదీ తీరంలో (జన్మస్థానంలో) వంద అశ్వమేధ యాగాల్ని చేసాడని ప్రశస్తి. వేదాలననుసరించి సరస్వతి నది హిమాలయాలలో బయలుదేరి పంజాబ్ రాజస్థాన్‌ల మీదుగ (గుజరాత్‌లో కూడ) సముద్రంలో కలుస్తుంది.

ముఖ్యంగా మహాభారత యుద్ధం తరువాత భూకంపాలు సరస్వతీ నదీ నాగరికతను నాశనం చేసాయి. అరేబియా సముద్రంలో వచ్చే ఆటు పోటుల వల్ల, అలల వల్ల పశ్చిమ భారత లోతట్టు ప్రాంతమంతా ఊడ్చుకుపోయి సరస్వతీ నదీ ప్రవాహం మీద ఇసుక పొరలు ఏర్పరచాయి.

## ప్రస్తుత పరిశోధనల ఫలితం:-

అంతరిక్షంలో ప్రయోగించిన అమెరికా ఉపగ్రహం 'లాండ్‌సాట్' 1971 లో మనదేశానికి సంబంధించి కొన్ని ఛాయా చిత్రాలను పంపింది. అహమ్మదాబాద్‌కు చెందిన అంతరిక్ష పరిశోధనాకేంద్ర శాస్త్రజ్ఞులు వీటిని పరిశీలించి సిమ్లా సమీపంలోని శివాలిక్ పర్వతాల నుండి గుజరాత్‌లోని 'కచ్' వరకు ఒక పెద్దనది ప్రవహించేదని, యమున, సట్లెజ్, దృశ్యద్వితీలు ఈ నదితో కలుస్తుండేవని నిర్ధారించారు. ఈ నది ప్రవహించిన మార్గంలో గల బావులలోని నీటిని రసాయనిక విశ్లేషణ చేసి ఈ నీరంతా ఒకటేనని నిర్ధారించారు.

## సింధు కాదు సరస్వతి:-

హరప్పా నాగరికత సింధూ నాగరికత కాదని అది సరస్వతీ నాగరికతని పరిశోధకులు వెల్లడించారు. ఇంకనూ హరప్పా వద్ద ద్వారక నివాసియైన శ్రీ కృష్ణాభగవానుడు తన అంతిమ దశలో ద్వారక సముద్రంలో మునిగి పోతుందనే భయంలో వర్తమానంలో ఆ నాగరికతను స్థానంతరం చెందించాడు. అందువల్ల మహాభారతంలో వర్ణించబడ్డ నగరాలు వాటి వ్యవస్థ సరస్వతీ తీర ప్రాంతంలోని నగరాలకు పోలిక ఉన్నది. అని కొంత మంది చరిత్రకారుల అభిప్రాయం.

భవిష్యత్‌లో ఆ నదీపై జరుగుతున్న పరిశోధనలు విజయవంతమైతే భవ్యమైన భారత చరిత్ర విశ్వానికి దర్శన మిస్తుంది. సరస్వతీ నాగరికత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. భారతదేశ చరిత్రలో సంభవించిన పలు సంఘటనలు సరస్వతీ నదితో ముడిపడి ఉన్నాయి. ఆర్యులు అనబడే ఒక తెగ ఉందని, అది బైటి నుండి వచ్చిందనీ ప్రతిపాదించే భ్రమకూడా తొలగిపోతుంది.

# తపతి

## పౌరాణికత:-

మహాభారతంలోని ఆది పర్వంలో అనదిని సూర్యపుత్రి అని అన్నారు. తపతి సంవరణుడనే రాజుకు కలిగిన కుమారుడు 'కురు'. ఆయనే కురువంశానికి మూల పురుమడని ఉంది.

భాగవతంలో కూడ తపతి గురించి విపులంగా ఉంది. తపతి మాహాత్మ్యం స్కాంద పురాణంలో కూడ ఉన్నది.

తపతీ పైన సుమారు 108 తీర్థాలు ఉన్నాయి. దీనికి 21 పేర్లు ఉన్నాయి.

ఉద్గమస్థలం:-

గుజరాత్ లోని సాత్పురా ప్రాంతంలోని (మహాద్రీ పర్వతాలకు పశ్చిమానగల) ముల్తాయ్ లేక ముల్తపి (మైదానం) లో నుంచి ఆవిర్భవించి గుజరాత్ లోని పలు ప్రాంతాల గుండా ప్రవహించి తర్వాత సముద్రానికి దక్షిణ ముఖంగా సూరత్‌వైపు వెళ్తుంది.

తపతి పరివాహ ప్రాంతంలో, ప్రకాశ, గోమతేశ్వరాలయం, సంగమేశ్వరాలయం మొదలగునవి ఉన్నాయి. తపతీ నదిని పర్వతాల కూతురుగాను, అరణ్యాల రాణిగాను చెపుతారు.

ప్రయోజనాలు:-

దాదాపు 400కి.మి. ప్రవహిస్తుంది.

దీనిపైన సూరత్‌లో 50 అడుగుల ఎత్తులో 'కక్రాపార్' ఆనకట్టను నిర్మించారు.

ఇది 5,62,000 ఎకరాల భూమికి సంవత్సరానికి రెండు పంటలకు సరిపడే నీరును అందిస్తుంది.

ఇక్కడున్న 'ఉకాయ' ప్రాజెక్టు నీటి పారుదలకే కాక విద్యుదుత్పాదనకు సహకరిస్తున్నది.

# కృష్ణవేణి

## పౌరాణికం:-

కృష్ణానది పరివాహ ప్రాంత మైన హంపీ సమీప ప్రాంతమే రామాయణంలో చెప్పబడిన కిష్కింధ అనియు శ్రీరాముడు హనుమంతున్ని కలుసుకోవటం ఇక్కడే జరిగిందని అంటారు.

## చారిత్రకం:-

వందల సం. పాటు సిరిసంపదలతో విలసిల్లి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన విజయనగర సామ్రాజ్యం కృష్ణానది ఉపనది తుంగభద్రాతీరాన్నే స్థాపించబడింది. శాతవాహన సామ్రాజ్యానికి రెండవ కేంద్రమైన ధరణికోట, సుప్రసిద్ధ శైవారామం అమరావతి, అర్జునుడు తపస్సు చేసిన ఇంద్రకీలాద్రి, విజయవాడనగరం, కనకదుర్గదివ్యసన్నిధి లాంటి ఎన్నో మహా తీర్థాలు, క్షేత్రాలు, చారిత్రాత్మక స్థలాలు కృష్ణా తీరంలో ఉన్నాయి. ద్వాదశ జ్యోతిర్ లింగాలలో ఒకటైన శ్రీశైల మల్లికార్జునుడు, అష్టాదశశక్తులలో ఒకటైన భ్రమరాంబికా దేవాలయము ఈ నదీ తీరాననే ఉన్నాయి. నాగార్జునకొండ, ప్రసిద్ధ రసాయనశాస్త్రాచార్యుడు నివసించిన స్థలం అమరావతీ మొదలగునవి ఈ నదీతీరాన ఉన్నవే.

## జన్మస్థలం:-

పశ్చిమ సాగరమైన సింధూ సాగరానికి 60 కి.మి. దూరంలో పంక్తులు తీరిన పశ్చిమ కనుమలలోని బ్రహ్మగిరి శిఖర సమీపంలోని అశ్వత్థ వృక్షమూలం నుండి జనించింది సహ్యాద్రి పర్వతాలలో ఉద్భవించింది.

సముద్ర మట్టానికి 1350 మీటర్ల ఎత్తున ఉన్న మహాబలేశ్వర హిల్‌స్టేషన్ సమీపంలో ఉద్భవించింది 'కృష్ణానది'.

మహారాష్ట్ర, కర్నాటక ప్రాంతాలలో ప్రవహిస్తూ అనేక ఉపనదులను తనలో కలుపుకుని కర్నూలు జిల్లా ప్రాంతంలో ఆంధ్రలోని ప్రవేశిస్తుంది. నందికొట్కూరు (కర్నూలు) గ్రామసమీపంలో తుంగబద్రా వీనిలో కలుస్తుంది. విజయవాడ తూర్పుకనుమల మీదుగ కృష్ణానది డెల్టా ప్రాంతంలో ప్రవేశిస్తుంది తర్వాత తూర్పున ఉన్న గంగాసాగరంలో కలుస్తుంది.

## పుణ్యక్షేత్రాలు:-

మహాబలేశ్వరం హంపీ, శ్రీశైలం, విజయవాడ మొదలగునవి.

## ఉపయోగాలు:-

మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రరాష్ట్రాల గుండ 1290 కి.మి. ప్రవహించి గంగాసాగర్‌లో కలుస్తుంది.

- 1885లో సర్ ఆర్థర్ కాటన్ ఈ నదిపైన విజయవాడ వద్ద 1,770 మీ. వెడల్పున ఆనకట్ట నిర్మించారు. (ప్రకాశం బ్యారేజి అదేస్థలంలో నిర్మాణమయింది.)
- కృష్ణా మరియు దాని ఉపనదుల పరీవాహక ప్రాంతం:- 1లక్షా 90 వేల కి.మి. వైశాల్యం
- నాగార్జునసాగర్ తదితర పద్దతుల ద్వారా దాదాపు 10లక్షల 50 వేల హెక్టార్ల భూమికి నీరందుతుంది.

## జల విద్యుత్తు:-

| | |
|---|---|
| కోయిన డామ్ వద్ద | 860 M.w. |
| శ్రీశైలం వద్ద | 440 M.w. |
| నాగార్జునసాగర్ వద్ద | 100 M.w. |
| ఖార్పూర్ వద్ద | 72 M.w. |
| తుంగభద్ర | 57 M.w. |
| మొత్త మీద | 1813 M.w. |

## తుంగభద్ర:-

తుంగభద్రా ప్రాజెక్టుద్వారా

కర్నాటకలో 37,374 హెక్టార్లు

ఆంధ్రలో 60,247 హెక్టార్ల భూమి సాగుబడి అవుతుంది.

# గోదావరి

## పౌరాణికం:-

గరుడ, మత్స్య, పద్మ బ్రహ్మాండ పురాణాలలో రామాయణ, భాగవత గాథలలో గోదావరి ప్రస్తావన ఉన్నది. దీనిని దక్షిణగంగ అనికూడా వ్యవహిస్తారు.

- భద్రాచలంకు '35' కి.మీ. దూరంలో శ్రీరామ చంద్రుడు నివసించిన 'పర్ణకుటీరం' ఉంది.

- బౌద్ధ, జైన సాహిత్యాలలో కూడ ఈ నది ప్రస్తావన ఉన్నది.

## చారిత్రకం:-

ఈ నదీ తీరంలో

- నాందేడ్ క్షేత్ర్యం, గురుగోవిందుని సమాధి ఉన్నాయి.
- నాసిక్ వద్ద పంచవటి ప్రాంతంలో సమర్థరామదాసు 12సం.లు తపస్సాధన చేసినారంటారు. ఇక్కడే 26 బౌద్ధ గుహలున్నాయి వీటిని "పాండులైనా" అంటారు.

## ఉద్గమస్థానం:-

మనం నిత్యం స్మరించే నదులలో గోదావరి 3వది. మహారాష్ట్రలోని పశ్చిమ కనుమలైన సహ్యాద్రి పర్వత పంక్తులలో నాసిక్ వద్ద త్రయంబకేశ్వర్‌లో జన్మిస్తుంది. త్ర్యయంబకేశ్వరుడు ద్వాదశజ్యోతిర్లింగ మూర్తులలో ఒకడు.

## పరీవాహ ప్రాంతము:-

పశ్చిమ సాగరానికి 50కి.మీ. దూరాన పుట్టిన గోదావరి ఆగ్నేయ దిశలో 450 కి.మీ. ప్రవహించి ఆంధ్రలో తూర్పు కనుమలైన పాపికొండల గుండా వడివడిగా ప్రవహించి, రాజమండ్రీ మీదుగా 3పాయలై తూర్పు సముద్రంలో కలుస్తుంది.

గోదావరి లోయ అంతటా 50 వేల సం. క్రిందట దట్టమైన అటవీ ప్రాంతమని 10వేల సం. నుండి మానవులు నివసిస్తున్నారు. శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించినాకనే గోదావరి విస్తరించింది. పాపికొండల నడుమ 200 గజాలుండే గోదావారి రాజమండ్రి వద్ద 2మైళ్ళు వెడల్పున తర్వాత 4మైళ్ళ వెడల్పున విస్తరించింది. రాజమండ్రీ వద్ద గోదావరి రెండుగా చీలింది. పశ్చిమ ప్రవాహం పేరు 'గౌతమి' ఇది నరసాపురం వద్ద, తూర్పుప్రవాహం వశిష్ఠ ఇది యానాం వద్ద సముద్రాన్ని కలుస్తాయి. సముద్రాన్ని కలిసే ముందు ఏడుపాయలుగా చీలుతుంది వాటి పేర్లు, కాశ్య అత్రి, గౌతమి, భరధ్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వశిష్ఠ

ప్రయోజనాలు:-

ధవలేశ్వరం వద్ద వశిష్ఠ గోదావరి, గౌతమీ గోదావరిల మీద 1849లో మేజర్ సర్ ఆర్థర్ కాటన్ ఆనకట్టలను నిర్మించాడు. 1890 పనిపూర్తయింది.

227 లక్షల ఖర్చయింది.

13 లక్షల ఎకరాలకు నీరు అందుతుంది.

పరివాహప్రాంతము:- 3.15ల.చ.కిలోమీటర్లు.

# తుంగ భద్ర

పౌరాణికం:-

భాగవతం, బ్రహ్మండ పురాణాలలో దీని గురించిన వర్ణన ఉంది.

చారిత్రకం:-

తుంగభద్ర నదీ ఒడ్డున 'శృంగేరి' ఉంది. ప్రసిద్ధ మైన ఈ స్థలంలో శంకరాచార్య పీఠం ఉంది. ప్రధానమైన నాలుగు పీఠాలలో శృంగేరి ఒకటి8వ శతాబ్దములో దీన్ని స్థాపించారు. మిగతావి ద్వారకా, బదరీ జగన్నాథం (పూరి)లో ఉన్నాయి.

## పేరు, జన్మస్థలం:-

తుంగ మరియు భద్ర అనే రెండు చిన్న నదులు కలిసి తుంగ భద్ర అయింది. ఈ రెండు నదులు కూడా పడమటి కనుమలలోని వరాహ పర్వతం మీద 'గంగమూల' అనే ప్రదేశంలో పుట్టాయి.

దీని తీరంలోనే ఉన్నవి హంపీ క్షేత్రము ప్రసిద్ధి గన్న విద్యానగరం లేక విజయనగరం. కర్నూలు దాటిన తర్వాత కృష్ణానదిలో కలుస్తుంది.

## ప్రయోజనాలు:-

దీని పొడవు:- 400మైళ్ళు.

తుంగభద్రా ప్రాజెక్టు ద్వార:- 3.3. ల. హెక్టార్లు భూమి సేద్య మవుతుంది.

విద్యుత్తు:- 63,000 కి.వాట్స్ ఉత్పత్తి.

# కావేరి

## ఉద్గమస్థానం:

సింధూ సాగరానికి 60 కి.మీ. దూరాన ఉన్న పశ్చిమ కనుమలలోని సహ్యాద్రి పర్వత పంక్తిలోని 'బ్రహ్మగిరి' దీనికి జన్మస్థలం.

దీనిపొడవు:- 760కి.మి.

ప్రవహించు ప్రాంతాలు:- కర్నాటక, తమిళనాడు.

సముద్ర మట్టానికి:- 1,320మీ. ఎత్తున

## కావేరి ప్రాశస్త్యం:-

ప్రతీ సంవత్సరము ప్రజలు బ్రహ్మగిరి పర్వతాలకు వెళ్ళి సంక్రాంతి రోజున కావేరి దర్శనం చేసుకుంటారు. కూర్గ్ ప్రాంతంలో ఉన్న ఈ పర్వత శ్రేణులు ప్రకృతి సౌందర్యంతో కన్నుల పండుగ చేస్తాయి.

వందనశిల వద్ద నమస్కరించి అక్కడి నుండి నీరు క్రింద చెరువులో పడుతున్న రమణీయ దృశ్యాన్ని తిలకిస్తూ తన్మయులవుతారు. కర్నాటక తమిళనాడులలో 'కావేరి' పేరుకు అత్యధిక ప్రాధాన్యం ఉంది. ప్రారంభంలో అతి ప్రశాంతముగా చిన్న ప్రవాహంలాగ అమాయకురాలిగా కనిపిస్తుంది. శ్రీరంగ పట్టణం. శివ సముద్రం వద్ద ఉరకలు వేస్తుంది.

## త్యాగరాజు:-

ప్రఖ్యాత సంగీతకారుడు త్యాగరాజు నివసించిన తిరువయ్యూరు కావేరీనది ఐదు పాయలు ఒక్కటైనచోట నిర్మించబడి ఉంది భారత సంగీతో జగత్తుకు కావేరీ నది అందించిన అద్భుత ఆణిముత్యాలలో త్యాగరాజు ఒకరు.

## ప్రయోజనాలు:-

కావేరీ నదిపైన 1600 సంవత్సరముల క్రితం చోళ వంశానికి చెందిన రాజు కరికాలుడు మొట్ట మొదట 160 కి.మి. పొడవున 'డ్యాం' నిర్మించాడు. ఈ ఆనకట్ట నిర్మాణం కోసం రాతిని మట్టిని కలిపిన తీరు అద్భుతం ఈ మిశ్రమ నిష్పత్తి ఇప్పటికి అధునిక ఇంజనీర్లను ఆశ్చర్యంలో ముంచెత్తుంది. కొన్ని వందల సం.లు ఇది కావేరి ఆటు పోటులను తట్టుకోని నిలబడింది. 19వ, శతాబ్దంలో దీన్ని విశాల మొనరించారు. ఇంకా మైసూరు తదితర ప్రాంతాల్లో ఆనకట్టలున్నాయి.

## శివ సముద్రం:-

90 మీటర్ల ఎత్తు నుంచి నీరు క్రిందకు పడే జలపాత దృశ్యల అద్భుతంగా ఉంటుంది.

మోక్షగుండం విశ్వేశ్వరయ్యచె మైసూర్ లో కావేరి పై కన్నాంబడి ఆనకట్టను నిర్మించారు. 2600మీ. వైశాల్యం 40 మీ. ఎత్తు ఉంది . 1911 లో ఈ ఆనకట్ట నిర్మాణం ప్రారంభమై 12 సం.ల తర్వాత నిర్మాణం పూర్తయింది.

## మహాముఖం

తమిళనాడు మధ్యలో ఉన్న కుంభకోణంలో 12 సం.ల కొకసారి "కుంభమేళా" లాగానే "మహామఘం" అనే మేళ జరుగుతుంది. దానికి దగ్గర్లోనే ఉన్న మయూరం పట్టణం ఎంతో ప్రసిద్ధి చెందింది. పచ్చని గుబుళ్ళ చుట్టూ నెమళ్ళే కనిపిస్తాయి. నెమలి మన జాతీయ పక్షి.

# పవిత్రతను పాడుచేస్తున్న పరిశ్రమలు

## కాలుష్యానికి గురవుతున్న గంగానది:

గంగమ్మ తల్లి అంటే సర్వ కలుష నివారిణి అని ప్రతి భారతీయుడు ప్రగాఢంగా విశ్వసిస్తాడు.

1894 లో ఇండియన్ మెడికల్ కాంగ్రెస్ వారు చేసిన పరిశోదనా ఫలితంగా గంగానదికి బాక్టీరియాను అరికట్టే శక్తి ఉన్నదని తేలినది. ఇంతటి అద్భుత శక్తి కలిగిన గంగాజలంలో మన ఆధునిక శాస్త్రీయ విజ్ఞాన ఫలితంగా పరిశ్రమల మూలంగా ఎలాంటి వ్యర్థ మైన హానికరమైన పదార్థాలు చేరుతున్నాయో గమనిద్దాము.

- గంగానదీ తీరంలో 100 పట్టణాలున్నాయి. వీటిలో దాదాపు 3 కోట్ల ప్రజలు నివసిస్తున్నారు. ఈ పట్టణాల నుండి ప్రతిరోజూ 900 మిలియన్ల లీటర్ల మురుగు నీరు గంగలో కలుస్తున్నది.

- గంగానదీ తీరంలో దాదాపు 130 పెద్ద కర్మాగారాలు ఉన్నాయి. వీటిలో వ్యర్థపదార్థాలను శుద్ధిచేసే ప్లాంటులు లేని పరిశ్రమలే ఎక్కువ.
- ఒక హుగ్లీ ప్రాంతంలోనే 90 జనుపనార మిల్లులు 60 ఇతర కార్మాగారాలు ఉన్నాయి. ఇవి ప్రతి రోజు 3,80,000 కిలో గ్రాముల వ్యర్థ పదార్థాలను గంగలో కలుపుతున్నాయి.
- జంతువుల పెంట శవాలను దహనం చేయగా ఏర్పడిన బూడిద, సగం కాలిన శవాలు ఇలా అనేక రకాలుగా గంగాజలం కలుషితమవుతుంది.

పై కారణాల వల్ల గంగాజలంలో సైనైడ్, ఆర్సెనిక్లైడ్, జింక్, సెలీనియం, క్రోమియం, మెర్క్యూరి, కాడ్మియం, ఫాస్ఫరస్ ఇంకా అనేక నైట్రేట్లు, సల్ఫేట్లు, సిలికేట్లు మొదలైన ప్రమాదకర (మలిన) పదార్థాలున్నాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

## స్వచ్ఛతకు ప్రతీతి:-

పై విషయాలను గమనిస్తే స్వచ్ఛతకు ప్రతీతిగా ఉన్న గంగ నేటు ఈకాలుష్యం వలన తన పవిత్రతను కోల్పోతున్నదా? అనే భయం కలుగుతుంది.

## కాలుష్యనివారణ:-

ఆలస్యంగా నైనా కళ్ళు తెరిచినది మన ప్రభుత్వం. గంగా జలాన్ని శుద్ధి చేసే పథకాన్ని ప్రారంభించినది దీనినే " గంగా యాక్షన్ ప్లాన్" అంటున్నారు. ఈ కార్యక్రమంలో హరిద్వార్, కాన్పూర్, అలహాబాద్ వారణాసులలో గంగా జలాన్ని శుద్ధిచేసే ప్లాంటులను ఏర్పాటు చేస్తున్నారు. ఈ ప్లాంటులు (గంగాజలాన్ని శుద్ధి చేయడం కాదు) గంగానదిలోకి వదిలే మురుగు నీటిని శుభ్రం చేస్తాయి. ఈ మురుగు నీటి నుండి వెలువడే

'మీథేన్'వాయువును విద్యుదుత్పాదనకు వాడతారు. ఈ 'గంగా యాక్షన్ ప్లాన్'కు ప్రపంచ బ్యాంకు నుండి సహాయం అందుతుంది. ఈ కార్యక్రమం విజయవంతమైతే గంగాజలాలో కాలుష్యం ఇప్పుడున్నంత కలువదు.

కేవలం ప్రభుత్వమే గాకుండా మనమంతా కూడా గంగా జలాన్ని శుభ్రంగా ఉంచే భాద్యతను స్వీకరించవలసిన అవసరం ఉన్నది. ప్రపంచంలో అపురూప మైన గంగానదిని, తరతరాల మన చరిత్ర, సంస్కృతికి ఆలవాలమైన గంగానదిని రక్షించుకోవడం మన తక్షణ కర్తవ్యం.

"నదులు మన జీవానాధారాలు" అనే విషయం మనం మరువకూడదు. ఆధునీకీకరణ, పారిశ్రామికీకరణల పేర భూమి పైన అతి తక్కువగా ఉన్న మంచినీరును పాడు చేసుకోవద్దు.

## జలం అమూల్యం

మహానుభావుడు ఆయుర్వేదానికి మూలపురుషుడు అయిన ధన్వంతరి చెప్పినట్లు పంచభూతాలతో మానవ శరీరం నిర్మించబడిందనేది శాస్త్రరీత్యా నేడు కూడా ఒప్పుకోబడుతుంది. మనకున్న రోగాలలో నూటికి 80% నీళ్ళవల్లనే వస్తున్నాయనేది చాలా మందికి తెలియదు. మనం నివసించే భూమిపై అయిదింట 4 భాగాలు నీటిచే ఆవరించబడి ఉన్నది. మనశరీరంలో సుమారు 75% నీరే. అయితే ప్రాణానికి కావలసిన మంచినీరు భూమిపైన ఎంత తక్కువగా ఉందో గమనిద్దాం!

| | |
|---|---|
| సముద్రంలో నీరు | 97.2% |
| మంచురూపంలో | 2.1% |
| భూమి అతిలోతుల్లో | 0.3% |
| భూమిలో 1/2కిలో మీటరు వరకు | 0.3% |

మంచి నీటి సరస్సుల్లో, ప్రవహించే నదుల్లో గాలిలో 0.1%

మొత్తం : 100%

పై పట్టికను గమనిస్తే సముద్రంలోని ఉప్పునీరు మనిషిత్రాగలేడు. గాలిలో, భూమి అతిలోతుల్లోగల నీరును మనిషి త్రాగలేడు. గాలిలో, భూమి అతిలోతుల్లో గల నీరును మనిషి ఉపయోగించే వీలులేదు. మనిషి మనుగడకు కావలసిన నీరు కేవలం భూమి అతితక్కువ లోతుల్లో ఉన్న నీరు, సరస్సులో, నదుల్లో ఉన్ననీరు మాత్రమే.

అంటే 299 వంతుల నీరు వదలి ఒక వంతు ఉన్న మంచినీటిపైన 600 మంది కోట్ల ప్రజలు, 100 కోట్ల జంతువులు, వందల కోట్ల పక్షులు లక్షల కోట్ల వృక్షాలు ఆధారపడి ఉన్నాయి. ఇటువంటి అమూల్యమయిన మరియు మన జీవనాధారమైన నదులలో ప్రవహించే మంచి నీటికి కలుషితం చేసుకుంటే మానవ మనుగడే ఉండదనేది నగ్నసత్యం, కనుక మనం ఇప్పటికైనా నాకళ్ళు తెరువాలి. కాలుష్య పెనుభూతం నుండి మన నదులను సంరక్షించుకోవాలి.

## నది కాలుష్యం - నర జాతికి ప్రాణాంతకం

మనదేశంలో నదీ జలాల కాలుష్యం దిన దినం ప్రమాదకస్థాయికి చేరుకుంటుంది. జాతీయ పరిసరాల నిర్మాణ పరిశోధనా సంస్థ చెబుతున్న నివేదిక ప్రకారం మన దేశం లోని జలాల్లో 70% మానవ వినియోగానికి అనర్హమైనది.

దేశంలో 142 ప్రధాన నగరాల్లో కేవలం '8' నగరాలకు మాత్రమే సంతృప్తి కరమైన మంచినీటి వ్యవస్థ, మురుగు నీరు తొలగించే సదుపాయం ఉన్నది.

62 నగరాలకు పాక్షిక సదుపాయాలున్నాయి

## ఇక కాలుష్య నష్టాలు:-

అనేక పరిశ్రమలు విషపూరితమైన రసాయనాలతో పాటు అత్యధిక ఉష్ణోగ్రత గల నీటిని నదులలోకి విడుదల చేయుడం వలన జల చరాల్ల ఆస్తిత్వం దెబ్బతినడం మాత్రమే గాక ఈ నదులు ప్రాణులు జీవించడానికే అవకాశం లేని విష ప్రవాహాలుగా మారుతున్నాయి. మన అధునిక వి(అ) జ్ఞానం వల్ల.

భారతదేశంలో 5000లకు పైగా ఉన్న భారీ మధ్యతరహా పరిశ్రమలు మన నదీ జలాల్ని కాలుష్యం చేస్తున్నాయి. దీనికి తోడుగా నగరాల్లో ఏర్పడే చెత్తకూడా కాలుష్యానికి కారణం అవుతున్నది.

భారతదేశంలో మూడింట రెండు వంతుల మంది కలుషితమైన నీటిని సేవించడం వల్లనే వ్యాధి గ్రస్తులవుతున్నారు.

## కలుషిత నీటి వల్ల వచ్చే వ్యాధులు:-

టైఫాయిడ్, కలరా, డయేరియా, పచ్చకామెర్లు, డిసెంట్రీ మొదలగు వ్యాధులు త్రాగు నీటిలో కాలుష్యం ఉన్నందు వల్లనే వస్తున్నాయి.

జల కాలుష్యం వల్ల లక్షలాది మంది ప్రజల ఆరోగ్యం అత్యంత ఆందోళన కరంగా తయ్యారైనది. లాభాల వేట తప్ప సామాజిక భాద్యతను గుర్తెరుగని పరిశ్రమల అధిపతులు వారితో సంభందాలు చెడుగొట్టుకోవడానికి సిద్దంగా లేని అధికారులు పరిస్థితిని మరింత దిగజారుస్తున్నారు.

## పరిశ్రమలు - ఒక పరిశీలన:-

బోకారో మరియు దుర్గాపూర్‌లోని బొగ్గు శుద్ధి కేంద్రం ప్రతి నెల దాదాపు 1800 టన్నుల బొగ్గును శుద్ధి చేసి ఆ మురికి నీటిని నదులలోకి వదులుతున్నారు.

ఇండియన్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ రోజుకు 15,000 క్యూబిక్ మీటర్ల వ్యర్థ పదార్థాలను విడుదల చేసి నదులులో కలుపుతుంది.

సింద్రి ఎరువుల కార్మాగారం మరియు దుర్గాపూర్ రసాయనిక కర్మాగారం దాదాపు 15 టన్నుల సల్ఫ్యూరిక్ ఆమ్ల అవశేషాలను 10 టన్నుల అమ్మోనియా అవశేషాలను నదులలో కలుపుతున్నాయి. దుర్గాపూర్ సమీపంలోని 7 పరిశ్రమలు ప్రతిరోజు 1.59 లక్షలు క్యూబిక్ మీటర్ల మలిన అవశేషాలను నదిలో కలుపుతున్నాయి.

మధ్యప్రదేశ్ లోని 220 కి పైగా ఉన్న పేపరు మిల్లులు డిస్టలరీ జౌళి మిల్లులు దాదాపుగా 1,50,00,000 గ్యాలన్ల మలిన పదార్థాలను విడుదల చేస్తున్నాయి.

## పశ్చిమ బెంగాల్:

హుగ్లీ నదిలో దాదాపు 12 లక్షల లీటర్ల ద్రవ రూప మలిన పదార్థాలు కలుస్తున్నాయి.

ఈవిధంగా ప్రతి పరిశ్రమ శక్తి వంచన లేకుండా నదీ జలాలను కలుషితం చేయడంలో నిమగ్నమయినాయి.

## నీటి కాలుష్యం ఏర్పడే మార్గాలు:-

- ఇండ్లలోని వ్యర్థ పదార్థాలు భూమిలో ఇంకడం వలన.
- సెప్టిక్ టాంకులు సరిగా లేకపోవడం మూలాన.

- వ్యవసాయంలో వాడిన నీరు. (రసాయనిక ఎరువులు, పురుగుల మందులు కలిసిన నీరు)
- వరదల సమయంలో మురికి నీరు మంచినీరు కలువడం వల్ల.
- జంతువుల వలన.
- కుళ్ళిన పదార్థాల వలన ఇంకనూ ఎన్నో మన అజాగ్రత్తల వల్ల అజ్ఞానం వల్లను కాలుష్యం జరుగుతుంది.
- దీనివలన 5 నుండి 10 సం. వయస్సు గల పిల్లలకు ఇచ్చే నీటి విషయంలో జాగ్రత్త తీసుకోవడం చాలా అవసరం.
- ప్రపంచంలో రోజుకు 2,5000 మంది పిల్లలు కలుషితమైన నీటి వలన చనిపోతున్నారనేది సత్యం.
- ఇంకా పరమ సత్యమేమంటే "మంచినీరు" త్రాగే మనిషి మామూలు మనిషికంటే 20 సం.లు ఎక్కువ బ్రతుకు తాడనేది మనం గమనించాలి.

# అనుబంధము-1

## మన నదులు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| క్రమం. | నది పేరు | పుట్టిన స్థలం | కలియు చోటు | ఉప నదులు |
| 1 | గంగానది | హిమాలయాలోని టిబెట్ పీఠ భూమి, గంగోత్రి | బంగాళా ఖాతము | యమున, గోగ్ర, గండకి, గోమతి, కోసి, సోన్ |
| 2 | సింధు | హిమాలయాలోని టిబెట్ పీఠభూమి కైలాసశిఖరం | అరేబియా సముద్రం | రావి, సట్లెజ్, బియాస్, జీలం, చీనాబ్ |
| 3 | బ్రహ్మపుత్ర | హిమాలయాలోని టిబెట్ పీఠభూమి | గంగా నదిలో కలిసి బంగాళా ఖాతంలో | |
| 4 | గోదావరి | పడమటి కనుమలలోని నాశిక త్రయంబకము | బంగాళా ఖాతము | మంజీరా, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, సీలేరు,మానేరు |
| 5 | కృష్ణ | పడమటి కనుమలలోని మహాబలేశ్వర్ | బంగాళా ఖాతము | తుంగభద్ర, దిండి, పాలేరు, కోయినా, వర్ణ, పంచ గంగా, మూసి, భీమ, ఘట ప్రభ, మలప్రభ,మున్నేరు |
| 6 | తుంగ భద్ర | పడమటి కనుమలోని వరాహపర్వతం | సంగ మేశ్వరం వద్ద కృష్ణా నదిలో | హాగరి |
| 7 | నర్మద | వింధ్య పర్వతం | అరేబియా సముద్రం | |
| 8 | తపతి | " | " | |
| 9 | కావేరి | కర్ణాటక రాష్ట్రంలోని బ్రహ్మగిరి పర్వతాలు | బంగాళా ఖాతం. | |

# అను బంధము-2

## బహుళార్థ సాధక ప్రాజెక్టులు

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| క్ర.సం. | నదిపేరు | ప్రాజెక్టు పేరు | లబ్ధి పొందుతున్న రాష్ట్రములు | వ్యవసాయ రంగం | విద్యుచ్ఛక్తి [illegible] |
| 1 | సట్లెజ్ (సింధూ నది ఉపనది) | భాక్రా నంగల్ | పంజాబ్ రాజస్థాన్ | 1.3 మిలియన్ల హెక్టార్ల భూమి | 3.3లక్షల కిలోవాట్స్ |
| 2 | దామోదర్ | దామోదర్ | బీహర్ | 0.4మి.హె. | 1.04 కి.వా. |
| 3 | మహానది | హిరాకుడ్ | ఒరిస్సా | 1.లక్ష హెక్టార్లు | 0.35 కి.వా |
| 4 | కృష్ణానది | నాగార్జున సాగర్ | ఆంధ్ర ప్రదేశ్ | 1.8 ల.హె. | 75 వేల కి.వా |
| 5 | తుంగభద్ర | తుంగభద్ర | ఆంధ్ర ప్రదేశ్ కర్నాటక | 0.3 మి. హె. | 83 వేల కి.వా. |
| 6 | కోశి | కోశి | బీహర్ | 0.5మి.హె. | 1.8మి. కి.వా. |
| 7 | గోదావరి | పోచం పాడు | ఆంధ్రప్రదేశ్ | 1,44000 పై | |
| 8 | మంజీర | నిజాం సాగర్ | ఆంధ్రప్రదేశ్ | 89,100హె | |
| 9 | కృష్ణానది | శ్రీ శైలం | ఆంధ్రప్రదేశ్ | 2లక్షల హె. | 30.కి.వా. |
| [illegible] | కృష్ణానది | ప్రకాశం బ్యారేజి | ఆంధ్రప్రదేశ్ | 3.24ల హె. | -- |

# ప్రముఖ పర్వత పంక్తులు

మహేంద్రో మలయ సహ్యో
దేవతాత్మా హిమాలయ
ధ్యేయో రైవత కో వింధ్యో
గిరిశ్చారావళి స్తథా.

- పర్వతాలు మన దేశాన్ని సుభిక్షం చేయుటకు కావలసిన వర్షపాతాన్ని అందిస్తున్నాయి.
- అనేక, అన్ని నదులకు జన్మ స్థానాలుగా నిలచి వ్యవసాయాధార దేశమైన మన దేశానికి నదుల ద్వారా అపార జల సంపదను నిరంతరం ప్రవహింప జేస్తున్నాయి.
- మన దేశ సరిహద్దు రక్షణ కవచాలుగా ఉపయోగ పడ్తున్నాయి.
- ఇంకను మన దేశ భౌగోళిక సామాజిక పరిస్థితులపై ప్రత్యేక ప్రభావాన్ని చూపెడ్తున్నాయి.
- అటవీ సంపదలకు, ఔషధములకు నెలవులుగా ఉన్నాయి.
- పవిత్ర క్షేత్రాలతో సంస్కృతి, సమైక్యతలను నిలయాలుగా ఉన్నాయి.

- ఇంతటి ప్రాశస్త్యాన్నీ, పవిత్రతను సంతరించుకున్నవి కనుకనే మనం పర్వతాలను దేవతా స్వరూపంగానే భావిస్తాము.

# మహేంద్ర గిరి (ఉత్కళ ప్రాంతంలో)

వీటినే పూర్వాచల్ లేదా తూర్పు పర్వతాలని పిలుస్తారు. ఇవి ఉత్కల్ ప్రాంతంలో (ఒరిస్సా తీరం) ఉన్నాయి. ఇవి మనకు బంగ్లాదేశ్ బర్మా దేశాల సరిహద్దులలో వ్యాపించి ఉన్నాయి. అర్ధ చంద్రాకారంలో ఈ పర్వత పంక్తి వ్యాపించింది.

సప్త చిరంజీవులలో ఒకరైన పరుశురాముడు ఈ పర్వత ప్రాంతంలో సంచరిస్తుంటాడని స్థానిక ప్రజల విశ్వాసము. రామాయణంలో కూడా దీని ప్రస్తావన కలదు. హనుమంతుడు సీతాన్వేషణకై బయలుదేరే ముందు సర్వ సంపదలకు నిలయమైన మహేంద్ర గిరిని అధిరోహించి అచ్చటినుండి వాయు మార్గంలో పయనించాడని ఉంది.

# మలయగిరి (కేరళలో)

అత్యంత రమణీయ ప్రాంతం ఈ మలయ మారుత పర్వతశ్రేణి ప్రాంతం. సందర్శకులను తన ప్రకృతి అంద చందాలతో ముగ్దులనొనరిస్తుంది. చల్లని పిల్ల గాలుల చేత హృదయాలను పరవశింప చేస్తుంది. ఒక అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభూతిని మన కందిస్తుంది. ఈ పర్వత ప్రాంతం. మైసూరు ప్రాంతములో ఈ పర్వతశ్రేణి ఉన్నది. చాముండేశ్వరీ తదితర పలు ప్రసిద్ధ దేవాలయాలకు నెలవు ఈ ప్రాంతం. లవంగం, యాలకులు అమూల్యమైన చందన వృక్షాలతో నిండి ఉంటూ భారత దేశానికి ఎంతో ఆదాయాన్ని అందిస్తుంది. అనేక సందర్భాలలో కవులు కూడ ఈ పర్వతాన్ని వర్ణించారు. జయదేవుడు కూడా మలయమమారుతము

ఒలె అని వర్ణించారు. మళయాల భాష కలిగిన కేరళ తీరం వరకు ఈ పర్వతాలు ఉన్నాయి.

## సహ్యాద్రి (మహారాష్ట్ర)

సహ్యాద్రి పడుమటి కనుమలలోని భాగమే . వీటి పొడవు 600కి.మీ. సరాసరి ఎత్తు 1200 మీ. పశ్చిమ తీరమున వర్షపాతము కురియుటకు ఈ పర్వతములే కారణము. దక్షిణ భారతములో పెద్ద నదిఐన గోదావరి, కృష్ణా నదులకు జన్మస్థలము ఈ పర్వతములే. త్రయంబకేశ్వర్ మొదలగు ప్రసిద్ధ పవిత్ర స్థలాలు ఇక్కడే ఉన్నాయి. హిందూ దేశంలోని అపూర్వమైన అమూల్యమైన వ్యక్తులలో ఒకరు అయిన వీర శివాజిని తీర్చి దిద్దినది ఈ కొండలే. గెరిల్లా పద్ధతి నిర్మాత శివాజి బాల్య జీవితమంతా ఈ సహ్యాద్రి పరసర ప్రాంతాలలోనే గడిచింది.

## హిమాలయాలు (ఉత్తరదిశలో)

ఉత్తరం యత్ సముద్రస్య
హిమాద్రేశ్చైవ దక్షిణం
వర్షం తత్ భారతంనామ
భారతీ యత్ర సంతతి

హిమాలయ కిరీటియై సముద్ర పాదపీఠియై అని పాడుకుంటాం ఉత్తరాన కాశ్మీర్ నుండి అస్సాం వరకు సుమారు 2500 కి.మీ. వరకు వ్యాపించి మనదేశానికి రక్షణకవచంగాను మరియు కీర్తిధాతగాను మహోన్నతంగా నిలిచాయి. హిమాలయాలు 50 వేల సం.కు పూర్వం ఏర్పడ్డాయి. 5లక్షల చ.కి.మీ. భూభాగాన్ని ఆక్రమించుకున్నాయి. అంటే

దాదాపుగా మనదేశం లో ఆరవ వంతు భూభాగాన్ని ఆక్రమించుకున్నాయి. జీవనదులైన గంగా, యమున, బ్రహ్మపుత్ర సింధూ నదులు హిమాలయాల శైథిల్యం వల్లనే నిరంతరం ప్రవహిస్తూ భారతిని సస్యశ్యామలంగా ఉంచగలుగుతున్నాయి.

- ఈ హిమాలయాలు లేకపోతే భారత ఎడారి అనిపిలువాలసి వచ్చేది మనదేశాన్ని.
- దట్టమైన సతతహరితారణ్యాల సంపద.
- 20 వేల రకాల ఔషధ మూలికల కేంద్రం.
- జలాన్ని (జీవనదులు), జలం ద్వారా విద్యుత్తు అందిస్తుంది.
- ప్రకృతి రమణీయతకేంద్రాలు.
- వేసవి విడుదులు.
- బదరీనాథ్, కేదారనాథ్, పశుపతినాథ్ లాంటి వేలాది పుణ్యక్షేత్రాలకు పుట్టినిల్లు.
- మానస సరోవరం లాంటి మూర్తిభవించిన సుందర ప్రదేశాలు.
- కైలాసశిఖరం శంకరుని నివాసమనే విశ్వాసం.
- ఉత్తర సరిహద్దు రక్షణ

ఈ విధంగా ఒకటేమిటి పలుప్రయోజనాలను ఈ పర్వతాలు మన కందిస్తున్నాయి. అందుకేనేమో ఈ దేశ ప్రజలు (హిందువులు)తమ దేశంలోని నదులు గిరులు కొండలకోనల చెట్లు పుట్టల ఒకటేమిటి ప్రతీ దానిలో పరమేశ్వర రూపాన్ని దర్శిస్తారు. ప్రతీ అణువును పవిత్రంగా భావిస్తుంటారు. అను నిత్యం పూజిస్తుంటారు.

అదుకేనేమో! ఒక దేశభక్త కవితా హృదయం ఈ విధంగా కీర్తించింది.

హిమాలయం నా భూ: నిలయం
ఊహలు ఉరికే మహాలయం
నీరై కరిగెడు నీ హారం
హైందవ జీవన మధుకాసారం
ఇది నాభారత దేశం
ఇది నా భావ నివేశం.

## రైవతము (గిరినార్)

కాటియావాడ అనే ప్రాంతంలో ఉన్నాయి. ఇక్కడున్న దామోదర గుండంలో చితభస్మాన్ని కలుపడం పవిత్రంగా భావిస్తారు.

అంబా మాత, భామూత ఆలయాలతో పాటు జైనులకు సంబంధించిన అనేక తీర్థ స్థలాలున్నాయి. ఈ రైవతకాద్రి పర్వతాలే నేడు గిరినార్ పేరున గుజరాత్ ప్రాంతములో పిలువబడుతున్నాయి.

## వింధ్య (మధ్య భారతంలో)

పశ్చిమాన ఉన్న గుజరాత్ నుండి ఇటు బీహార్ వరకు ఇంచు మించు ఈ దేశం మధ్యలో, భారత ద్వీపకల్పానికి అడ్డంగా 1050 కి.మీ. పొడవున వ్యాపించి ఉన్నాయి.

నర్మద, షోణ్, భద్రా నదులకు జన్మస్థానము భారత మాతకు మణికిరీటం హిమాలయాలైతే భారత మాతకు వడ్డాణంగా వింధ్యా పర్వతాలున్నాయని ఈ పర్వతాలను ప్రస్తుతిస్తారు.

# ఆరావళి (రాజస్థాన్)

ప్రపంచంలోనే అతి పురాతన మైన పర్వతాలతో మన దేశ పశ్చిమోత్తర భాగంలో ఉన్న ఆరావళి' కూడా ఒకటి . ఈ పర్వతాలు రాజస్థాన్ ప్రాంతంలో ఉన్నాయి.

'అభు' అనే ఎత్తైన శిఖరంపైన ప్రసిద్ధ జైనుల తీర్థ స్థలం ఉంది. భారత మాత పరాయివారి పైశాచకత్వానికి బలిఅవుతున్నతరుణంలో శౌర్య ప్రతాపాలకు ప్రతీకగా నిలచిన రాణా ప్రతాప్ భారతి ముద్దు బిడ్డ అవిర్భవించాడు. తర్వాత మన మాతృదేశాన్ని స్వతంత్రం చేయుట కొరకు, పరాయి వారిని మన ఈ పవిత్ర స్థలం నుండి పారద్రోలేందుకు దాదావు 20సంవత్సరములు అయన ఈ ఆరావళి పర్వతాలే అశ్రయంగా చేసుకుని (అక్బర్‌తో) స్వతంత్ర సమరాన్ని కొనిసాగించాడు. (అడవులందు ఇడుములంబడి) ఈ విధముగా అతి పురాతన పర్వత వంక్తులైన ఆరావళి పర్వతాలతో పలురకాల చారిత్రాత్మక అంశాలు పెనవేసుకుని ఉన్నాయి.

# తీర్థస్థలాలు - పుణ్యక్షేత్రాలు

మనం ఇప్పుడు వివిధ రూపాలలో పలు ప్రాంతాలలో ఉన్న ఒకే పరమాత్ముడైన దేవున్ని దర్శించబోతున్నాం.

దేవాలయం లోకి వెళ్ళేముందు దేహాలయాన్ని పరిశుభ్ర మొనరించుకుంటాం కదా!

రండి! మన మందరం స్నానం చేసి భారతమాత పాద పద్మాలను తనివి తీరా దర్శించు కుందాం!

సాగర త్రయ సంగమస్థలి: (కన్యాకుమారి అగ్రము) 1. హిందూ మహాసముద్రము

ఇది మహాసముద్రాలలో 3వది. 8,046 మీటర్ల లోతు కలిగి 2 కోట్ల 84 లక్షల చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి ఉన్న అపార జలరాశి ఇది మనదేశానికి దక్షిణం వైపున ఉన్నది.

పశ్చిమాన: అరేబియా సముద్రంగా పిలువబడుతున్న సింధూసాగరం 2400 మీ. లోతు, 10 లక్షల 62వేల చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి ఉంది.

తూర్పున: బంగాళాఖాతంగా పిలువబడుతున్న గంగాసాగర మున్నది.

గంగా, యమున, బ్రహ్మపుత్ర, గోదావరి కృష్ణా తదితర అనేక నదులు గంగా సాగరంలోనే కలుస్తున్నాయి. భారత్‌లో వివిధ ప్రాంతాలలో ప్రవహించే నదులు సముద్రాలలో కలిసి భారతమాత పాదాలను స్పర్శిస్తూ, పవిత్రమవుతూ పరవశించి పోతాయి.

కన్యాకుమారి: ఇది మన దక్షిణ సరిహద్దు ప్రాంతం.

ఉభయసంధ్యల అత్యద్భుత మనోహర రీతిలో ప్రభాకరుని దివ్య సందర్శనం కలిగించే ఏకైక ప్రాంతం.

శ్రీ కుమారి పవిత్ర మందిరం ఇక్కడే ఉంది.

అను నిత్యం భక్తి భావంతో మన దేశంలోని పవిత్రమైన మహిమాన్వితమైన స్థలాలను స్మరించుకుంటూ ఉంటాము.

ఈ విధంగా:

అయోధ్యా మధురా మాయా
కాశీ కాంచి అవంతికా
వైశాలీ ద్వారికా ధ్యేయా
పురీ తక్షశిలా గయా

ప్రయాగః పాటలీ పుత్రం
విజయా నగరం మహత్
ఇంద్ర ప్రస్థం సోమనాథః
తథాఽ మృత సరః ప్రియం. అని.

కనుక మొదట ఈ పవిత్ర స్థలాలను సందర్శించు కుందాం రండి!

# అయోధ్య (ఉ.ప్ర)

"రామో విగ్రహవాన్ ధర్మః అని కీర్తించబడే సద్గుణాభిరాముడైన శ్రీరామచంద్రుని జన్మస్థలమది.

ప్రశాంత గంభీర సరయూనదీ తీరాన వెలసిన అత్యంత సుందరమైన కట్టడాలతో విరాజిల్లుతూ రఘురాముని చరిత్రను తర తరాలకు అందించే స్ఫూర్తి కేంద్రం అది.

అనునిత్యం అనేక సార్లు 'జై శ్రీరామ్' అనే పవిత్ర నాదం నలువైపులా వినిపిస్తుంది.

దాదాపు 6 వేల ఆలయాలతో అయోధ్య అణువు అణువు పవిత్రమైంది.

మన నిరాశ, నిస్తేజ, నిర్వీర్యాలకు ప్రతీకగా పవిత్ర జన్మస్థలంలో విదేశీ చిహ్నం నిలబడి మనల వెక్కిరిస్తున్నది.

దీన్నికై విశ్వహిందూ పరిషత్ ఉద్యమం, రామశిలా పూజ, శిలాన్యాసం శ్రీరామ జ్యోతి రథయాత్ర, కరసేవ మొదలగు కార్యక్రమాల ద్వారా తిరిగి ఒక దివ్యమైన ఆలయ నిర్మాణం కోసం ప్రయత్నిస్తుంది.

# మధుర (ఉ. ప్ర)

ధర్మార్థ కామమోక్షాల సాధనకై కావలసిన మార్గాన్ని నిర్దేశించి, ఆచరించి, గీతాసారాన్ని శాశ్వతంగా మనకందించిన యుగ పురుషుడు శ్రీకృష్ణుడు.

మధుర శ్రీకృష్ణుని కర్మభూమి. ఇది కూడా అయోధ్య లాగే పరాయి వారి కిరాతకాలకు బలయి, స్వస్వరూపాన్ని కోల్పోయి బానిస చిహ్నమయి సంరక్షించబడుతూ స్వాభిమానం స్వాతంత్ర్యం ఇంకా మనకు రాలేదనే విషయాన్ని గుర్తు చేస్తుంది.

# మాయ (హరిద్వార్)

హరిద్వార్ భారతీయుల పుణ్యక్షేత్రాలలో ప్రముఖమైన క్షేత్రం.

పరమ పవిత్ర గంగానది భూతలం పైన కనపడే స్థలమది. గంగను ఆహ్వానించే స్వాగత ద్వారమిది పూజనీయులైన సాధు సంతుల నిరంతర తపో సాధనలతో అణువణువు పవిత్రమైన ప్రశస్త స్థలం ప్రకృతి అందాలను తనలో నింపుకున్న క్షేత్రం.

అనేక పుణ్య క్షేత్రాలకు ప్రారంభ స్థలమది.

# కాశి (ఉ.ప్ర)

కాశీయే వారణాశి, బనారస్ అను పేర్లతో కూడా పిలువబడుతుంది.

హిందువులు తమ జీవితంలో ఒక్కసారైనా తప్పనిసరిగా దర్శించుకోవలను కునే ప్రశస్త పవిత్ర పుణ్య క్షేత్రం కాశి. పవిత్ర గంగానది తీరంలో వెలసిన కాశి విశ్వనాథున్ని దర్శించుకుంటే మోక్ష ప్రాప్తి లభిస్తుందనే ప్రగాఢమైన విశ్వాసం మనలో ఉంది.

అయితే ఇది కూడా మన అలసత్వం వలన నిజమైన స్థలం అన్యాక్రాంతమయి దాని ప్రక్క స్థలంలో తిరిగి నిర్మించబడింది. చాలామంది ఇప్పుడున్నదే మొదటి స్థలమనుకొని మోసపోతారు. తెలిసిన వారు పాత ఆలయాన్ని (నేటి మసీదును) చూసి కుమిలి పోతుంటారు.

వి.హిం.ప. దీని ఉద్ధరణకై త్వరలో ఉధ్యమిస్తానని ప్రకటించింది.

ప్రఖ్యాత హిందూ బనారస్ యూనివర్సిటి ఇక్కడే వున్నది. శ్రీ మదన్ మోహన మాలవీయ దీని సంస్థాపకులు. దీని దగ్గరే సారానాథ్ బౌద్ధక్షేత్రం ఉన్నది.

# ప్రయాగ (ఉ.ప్ర)

తీర్థ రాజము ప్రయాగ

త్రివేణి సంగమ పవిత్ర భూమి ప్రయాగ.

పవిత్ర నదులైన గంగా యమున మరియు అంతర్వాహిణియైన సరస్వతీ నదుల అద్భుత మనోహర సంగమ స్థలమది. ప్రతీ సం. మాఘ మాసంలో మాఘమేళ జరుగుతుంది. ఈ మాసంలో లక్షలాది మంది పవిత్ర స్నానాలు చేస్తారు. ఆ సమయంలో గంగా తీరం ఒక ధర్మప్రచార వేదికగా ఉంటుంది. ప్రతి 12 సం.ల కొకసారి కుంభమేళ జరుగుతుంది. దేశవిదేశలనుండి మునులు, సాధువులు, సంతులు, భక్తులు కోట్లాది జనసందోహం ప్రయాగను చేరి త్రివేణిసంగమంలో స్నానం చేసి తమ జీవితాలను పవిత్రం చేసుకుంటారు.

## హృషికేశ్

మహత్వపూర్ణమైన యాత్రా స్థలం బదరీ నాథ్, కేదార్‌నాథ్ ఆలయాల సందర్శనకు పోయే మార్గంలో తొలుత మనకు తటస్థించే పవిత్ర స్థలమిది.

తెల్లని హిమాలయాలు, దట్టమైన అరణ్యాలు, పూజనీయ సాధు సంతులు నదీమతల్లుల నిలియమిది.

హృషీకము అంటే ఇంద్రియము ఇంద్రియాలను నియంత్రించుకునుటకు దోహద పడే స్థలము ఇది.

ఇంద్రియాధినేత అయిన హృషీకేశుని సన్నిధానం కనుక దానిని హృషి కేశమని అన్నారు.

# బదరీనాథ్

ఇది చతుర్ధామాలలో ఒకటి

రుషికేష్ నుండి దాదాపు 500 కి.మి. దూరంలో చల్లని చక్కని ప్రదేశంలో హిమాలయ పాద పీఠంలో నెలకొని ఉన్నది. ఈ పవిత్ర బదరీనాథ క్షేత్రం.

అది శంకరాచార్యుని మాతృదేవి తన మరణానికి ముందు తన బంగారు ఆభరణాలన్ని పంపిస్తుంది. వాటిని అమ్మి బదరీనాథ్ ఆలయాన్ని నిర్మించాడు. ఈ ఆలయం 2300 అడుగులు ఉందంటారు. ఆలయంలో భగవంతునికి భోగం సమర్పించే బంగారు గిన్నె శంకరాచార్యులు ఇచ్చిందే. నేడు కూడా ఆలయంలో అర్చకులుగా ఉన్నది అది శంకరుని బాల్య మిత్రుడైన అగ్నిశర్మ వంశజులే. అది శంకరాచార్య నిర్మించిన ఆ పరమ శివుని మందిరం భవ్యంగా శిఖముత్తుకు నిలబడి ఉన్నది. భక్తులను పవిత్రుల చేస్తున్నది. ఆ ఆలయంలాగే ఆట అది శంకరులు చిరస్మరణీయుడైనాడు. దీనికి కొద్ది దూరంలో ఉన్నది మరో ప్రసిద్ధ శైవ క్షేత్రం కేదార్‌నాథ ఆలయం.

# అమర్‌నాథ్

హిమాలయాలలో ఉన్న ప్రసిద్ధ శివ క్షేత్రమిది. ఇది కేవలం శ్రావణ మాసంలో మాత్రమే తెరిచి ఉంచుతారు.

శ్రావణ మాసం శుక్ల పక్షమిన సహజంగా మంచుతో శివలింగం ఏర్పడటం మొదలై కృష్ణ పక్షం నాటికి సంపూర్ణ శివలింగాకృతి నొందుతుంది ఆ రోజున లక్షలాదిమంది ఆ సహజ శివలింగాన్ని దర్శించుకుని

పవిత్రులవుతుంటారు. అందుకేనేమో ఈ స్థలాన్ని అమరనాథ్ అని పిలుస్తున్నారు. మళ్లీ కృష్ణ పక్షమి నుండి ఈ సహజ శివ లింగం క్రమశః కరిగి పోయి అదృశ్య మవుతుంది. ఇది ఈ క్షేత్ర ప్రత్యేకత.

# కురుక్షేత్రం (హరియాన)

ధర్మక్షేత్రం కురుక్షేత్రం, కురుపాండవుల సంగ్రామ స్థలం. లక్షలాది మంది తమ పవిత్రాశయమైన 'ధర్మ సంరక్షణ' కోసం ప్రాణాలర్పించిన పుణ్యస్థలి.

నిష్క్రియులను సక్రియులుగా చేసి లక్ష్యోన్ముఖులుగా చేసేందుకని అమూల్యమైన భగవద్గీతను బోధించినది ఈ క్షేత్రంలోనె ఈ పవిత్ర భగవద్గీత ప్రపంచంలోని '350' భాషలలో ముద్రించబడింది. ఆ అన్ని భాషలలో ప్రచురించిన ప్రతులు ఇక్కడి గ్రంథాలయంలో భద్రపరిచినారు.

ఇక్కడి భూమి ఎరుపు రంగులో ఉంటుంది. దీనిపై పరిశోధనలు జరుగుతున్నాయి. మహా భీకర సంగ్రామం లక్షలాది మంది రక్త తర్పణమే ఈ ఎరుపుకు కారణమేమో అని కూడా అనుకుంటున్నారు. మహాభారతంలోని అనేక దృశ్యాలు మనకు ఇక్కడ దర్శనమిస్తాయి. కురుక్షేత్ర సంగ్రామం తదితర అనేక సంఘటనలను మనకు ఇక్కడి ప్రతిమలు స్ఫురణకు తెచ్చేవిధంగా ఉన్నాయి.

ఇది ఒక పవిత్రమైన ప్రముఖమైన సందర్శనీయమైన స్థలం. తర తరాలకు ఒక సందేశాన్నందించే భూమి కురుక్షేత్రం.

# ఢిల్లీ (ఇంద్రప్రస్థం)

హస్తినాపురం కురువంశజుల రాజదాని అయితే (ఇది నేటి మీరట్ జిల్లాలో ఉంది U.Pలో) ఇంద్రప్రస్థం (నేటి ఢిల్లీ) పాండవుల రాజధానిగా నిలిసిల్లింది. అప్పటి నుండి మనదేశ చరిత్రలో ఇంద్రప్రస్తానికి ఒక ప్రత్యేకత ఉన్నది.

విశ్వవిజేత కావాలని వచ్చిన అలగ్జండర్‌ను ఓడించిన పర్వతకుని ఆర్యకలాపాలకు నిలయం ఈప్రాంతమేని. నేడుకూడ మనదేశ రాజధాని.

ఢిల్లీ నుండి కన్యాకు మారికి మధ్యదూరం ఎంతో నలువైపుల మన దేశ వైశాల్యం అంత ఉండేది అందవలననే ఢల్లీని కేంద్రమగా చేసుకుని పరిపాలించారు.

## లోహస్తంభం:

ఇది కుతబ్‌మినార్‌కు దగ్గరలో వుంటుంది. ౪ వ శతాబ్దంలో రాజాధవుడు ఈ లోహస్తంభాన్ని ప్రతిష్టించాడు. దీని ఎత్తు ౨౩ అడుగులు అడుగు భాగం చుట్టు కొలత ౧౬౪ అంగుళాలు. శిరోభాగాన ౧౨.౦౮ అంగుళాలు. ఇది ౧౬ శతాబ్దాలముండి వర్షానికి, వాయువుకు తట్టుకొని నిలబడి ఉన్నది. దీని ప్రత్యేకత ఏమిటంటె ఇంతకాలం నుండి ఆ లోహస్తంభం త్రుప్పుపట్టలేదు. ఇదోక అత్యద్భుతం. దినిని విష్ణుమూర్తికి సమర్పించినట్లు దానిపై చెక్కబడింది.

సముద్ర గప్తుని కాలంలో ఖగోళశాస్త్ర పరిశోధనలకై నిర్మించిన ప్రయోగశాల విష్ణుధ్వజం నేడు కుతుబ్‌మినార్‌గా పిలివబడుతున్నది. సముద్రగుప్తుని కాలంలో హస్తినాపుర నౌకా శక్తి ఘనముండేది.

# ద్వారక (గుజరాత్)

ద్వాపార యుగ పురుముడు మహాభారతంలో ప్రధాన పాత్రదారి భగవద్గీత బోధకుడు అయిన శ్రీకృష్ణుడు నిర్మించిన స్థలం ద్వారకా.

దీనిలో అధిక భాగం సముద్రగర్భంలో కలిసిపోయింది. దీన్నికై నేడు పరిశోధనలు జరుగుతున్నాయి. ఆధారాలు లభ్యమవుతున్నాయి. ఇక్కడి గృహాలు, వీటి నిర్మాణము సింధూ నాగరికతను పోలిఉన్న. హరప్పా, మహనొంజోదార ప్రాంతాలకు శ్రీకృష్ణుడే యాదవులను అక్కడి తీసుకుని వెల్లాడని కూడ ఉంది. మొహన్-జో- దారో నే శ్రీ కృష్ణనివాసం స్థలం మొహనొజోదారో కావచ్చును.

ద్వారిక పరిసరప్రాంతములోనే శంకరుడు నిర్మించిన చతుర్ధమాలలో ఒక ధామ ముంది ఇది గుజరాత్ రాష్ట్రంలో ఉంది.

# సోమనాథ్ (గుజరాత్)

ప్రసిద్ధ శైవక్షేత్రమిది. జ్యోతిర్లింగములలో ఒకటైన స్థలమిది.

ఈ సోమనాథ మందిరంలో శివలింగం గది మధ్యలో గాలిలో నిలిచి ఉండేది. ఈ ఆలయం అపార సంపదలతో దేదీప్యమానంగా ఉండేది. దీనిపైన మహమ్మద్ గజనీ దాదాపు 10 సార్లు దాడిచేసి ఈ అపార సంపదలను ఒంటెలపై ఎక్కించుకొని దోచుకుపోయాడని చరిత్ర చెబుతుంది. దాడికి విధ్యంసానికి గురైన ప్రతిసారి జీర్ణోద్ధారణ చేయడం జరిగింది. చివరి సారి మాత్రం స్వాతంత్ర్యానంతరం మన ప్రియతమ నాయకుడు ఉక్కుమనిషి స్వర్గీయ సర్దార్ వల్లభభాయి పటేల్ ఈ ఆలయాన్ని

పునర్నిర్మించగా రాష్ట్రపతి రాజేంద్రప్రద్ దీనిని ప్రారంభించారు. ఈ సోమనాథ్ గుజరాత్ ప్రాంతంలో ఉన్నది.

# పూరీ

ఆదిశంకరాచార్యులచే స్థాపించబడిన చతుర్థామములలో ఒకటి ఇక్కడి ఉన్నది.

పూరీ (జగన్నాథుని) విశ్వవిఖ్యాతి గాంచిన ప్రసిద్ధ క్షేత్రం. ఇక్కడి విశేష మేమిటంటే చెక్కతో చేసిన భగవంతుని విగ్రహాలుంటాయి. ఇక్కడ కుమ్మరులు ఆలయానికి సంబంధించిన అన్ని కార్యక్రమాలు నిర్వహిస్తారట ప్రతి సం. జరిగే పూరీ జగన్నథ రథయాత్రలో లక్షలాది భక్తులు పాల్గొంటుంటారు. ఇది ఒక అధ్యాత్మిక శ్రద్ధాకేంద్రం. పుణ్యక్షేత్రం.

# కోణార్క్

ఇది సుప్రసిద్ధ సూర్యదేవాలయం అత్యంత రమణీయ శిల్ప సంపదకు నెలవు ఈ కోణార్క్.

ఈ ఆలయం నిర్మాణం వెనుక ఎంతో అమూల్యమైన వైజ్ఞానికత దాగి ఉన్నది.

కాలగణనకోసం తగినట్లుగా దీని నిర్మాణం జరిగింది. ఇది ఆలయం మాత్రమే కాదు ఇది ఒక పరిశోధనశాల కూడా 7 గుర్రాలపై సూర్యుడు అంటే ఇది ఒక వారానికి చిహ్నం వారంలోని 7 రోజులకు సంకేతం ఈ 7గుర్రాలు. అదేవిధంగా రథ చక్రాన్నిలో 12 భాగాలున్నాయి. అంటే కాలం

అనేది చక్రమని ఆ 12 భాగాలు 12 నెలలుకు గుర్తని మనకు తెలుస్తుంది. ఇంకను పలు ప్రముఖమైన విషయాలు అందులో దాగిఉన్నాయి.

# రామేశ్వరం (తమిళనాడు)

శ్రీరాముడు హనుమంతునికి మరియు సమస్త సమాజానికి అద్భుతమైన సందేశాన్ని అందించిన ప్రదేశం రామేశ్వరం.

శ్రీరాముడు సేతుబంధనానికి ముందుగా శివపూజ చేయడం కోసంగాను మట్టితో (ఇసుక)తో లింగాకృతి చేయగా హనుమంతుడు రాతి లింగం తెస్తాడు. దేవుడు కేవలం విగ్రహాల్లో మాత్రమేకాదు మట్టిలోనూ మహియంతయును ఉన్నాడు అని శ్రీరాముడు సందేశాన్నందిస్తాడు.

సేతు బంధన నిర్మాణ ప్రారంభస్థలం ఇదేనంటారు. ఈ శతాబ్దంలో భారతీయులలో తిరిగి ఏకాత్మతాభావనిర్మాణం కోసంగాను విశ్వహిందూపరిషత్ జరిపిన ఏకాత్మ యజ్ఞం కూడా ఇక్కడే పరిసమాప్తి అయింది.

జ్యోతిర్లింగాలలో ఒకటి ఇది (మధురై నుండి 200 కి.మీ దూరంలో ఉన్నది).

# రాంటేక్ (మహారాష్ట్ర)

మహారాష్ట్రలోని ఒక అత్యద్భుతమైన అతి సుందరమైన ప్రాంతం రాంటేక్. శ్రీరామచంద్రుడు అరణ్యవాసం చేస్తున్న సమయంలో ఈ ప్రాంతంలోని వీరిని హింసిస్తున్న రాక్షసులను హతమారుస్తానని ప్రతిజ్ఞ

చేసాడని అందుకే ఆ ప్రదేశానికి "రాంటేక్" అని పేరు వచ్చిందని స్థానికుల కథనం:

సుప్రసిద్ధ కవి కాళిదాసు తన అద్భుతమైన "మేఘ సందేశం" అనే కావ్యాన్ని రచించిన స్థలమిది వందల అడుగుల ఎత్తున ప్రకృతి రమణీయతతో తులతూగుతూ ఉండే సుందర ప్రదేశం ఇది. కాళిదాసు స్మృతి మందిరం, శ్రీరామాలయం ఇక్కడ ఉన్నవి. నాగపూర్ నుండి దాదాపు 25 కి.మీ. దూరంలో ఉన్న ఒక యాత్రాస్థలమిది. అనునిత్యం అనేక మంది యాత్రికులతో కిట కిటలాడె కేంద్రమిది.

రాష్ట్రీయ స్వయం సేవక సంఘ ద్వితీయ సర్ సంఘ్ చాలక్ అయిన పూ.పూ. గురూజీ మాధవరావు సదాశివ రావు గోల్వాల్కర్ తండ్రిగారు నివసించిన గ్రామమిది. వారి యొక్క స్వగృహము నేడు సంఘ కార్యాలయము.

## శ్రీశైలం (ఆంధ్రప్రదేశ్)

భారతదేశంలో గల పుణ్యక్షేత్రాలలో శ్రీశైలం ప్రసిద్ధ పావనక్షేత్రం. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లా నందికోట్కూరు తాలుకాలో కృష్ణానదీ తీరాన నల్లమలకొండలలో 15 వేల అడుగుల ఎత్తున వున్నదీస్వామి వారి క్షేత్రము. ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటి ఈ మల్లికార్జునాలయము.

శ్రీ శ్రీశైలం పురాణ ప్రసిద్ధములైన శ్రీ పర్వతములు మూడింటిలో ఒకటి. రెండవ శ్రీగిరి మహాయాన బౌద్ధాచార్యుడు నాగార్జునుడు నివసించిన కొండ. మూడవ శ్రీగిరికి శ్రీనివాసుడు వెంకటేశ్వరస్వామిగా వెలసిన ప్రసిద్ధ ప్రసిద్ధ తిరుపతికొండ.

ఈ శ్రీశైలానికి శ్రీగిరి, శ్రీనగము, శ్రీ పర్వతము అనే నామాంతరములు ఉన్నాయి. ఈ క్షేత్రము 8 ద్వారములతో, 8 శిఖరములతో9పురములతో 9 నందులతో అసంఖ్యాక దేవతలతో అలరారుచున్న పార్వతీ పరమేశ్వరుల దివ్యక్షేత్రము అనంతమైన ప్రకృతి సంపదలతో, యంతో రమణీయంగా అలరారుతూ యాత్రికులను భక్తి పారవశ్యంతో ముంచుతుంది. ఈ క్షేత్రంలో అమొఘములైన ఖనిజాలు, అపూర్వములయిన ఓషధములు, అగణితమునైన సిరి సంపదలు అనంతముగావున్నాయి. మందిరాలు, మఠాలు, వాగులు కొండలు వనాలు, నాటికలు భక్తుల్ని, భోగులు విరాగులు, సన్యాసులు, బైరాగులు, సిద్దులు సాధకులు సంధర్శకులతో నిండి వుంటుంది నిరంతరము ఈ క్షేత్రము. ఈభూలోక్కకైలాసము నందలి అద్భుతాలు అనతంము, అన్న సత్రములకు, వసతి సదుపాయములకు నేడు కొదువ లేదిక్కడ.

ఈ క్షేత్ర నిర్మాణం ఏనాడు జరిగిందో ఇదమిద్ధంగా లేనప్పటికి కృతయుంగంలో హిరణ్యా కశ్యపుడు త్రేతాయుగంలో శ్రీరాముడు ద్వాపార యుగంలో పాండవులు కలియుగంలో జగద్గురు శంకరాచార్య, ఆచార్య నాగార్జునుడు ఛత్రపతి శివాజీ, శ్రీకృష్ణదేవారాయలు అదిగాగల ఎందరెందరో ప్రముఖులు ఈ క్షేత్రాన్ని సందర్శించినట్లు శాసనాలు, కట్టడాలు వెల్లడిస్తున్నాయి. ఈ క్షేత్రాన్ని శ్రీ శివాజీ రెండుసార్లు దర్శించాడు. ఇక్కడే ఆయనకు భవానిమాత ఖడ్గం ఇచ్చి. ఆత్మాహుతి చేసుకోబోతానన్న ఆ వీరునికి, హిందవీ సామ్రాజ్య నిర్మాణానికి స్పూర్తి నిచ్చిందని గాధ. శ్రీ శివాజీ ధ్యాన మందిరాన్ని నిర్మించుకున్నాడిక్కడ. ఒక గోపురాన్ని కూడా నిర్మించాడు. దానిని నేటికీ శివాజీ గోపురమనే పిలుస్తారు. ప్రాంత, భాషా భేధాలు లేని ఆ హైందవ వీరుని స్పూర్తిని భద్రపరచుకునే నిమిత్తం ప్రస్తుతం అక్కడ ఒక మహత్తరమైన ఛత్రపతి శ్రీ శివాజీ స్మృతి మందిరం నిర్మాణమవుతున్నది. అదొక దర్శనీయమైన స్థలం.

# స్ఫూర్తి కేంద్రాలు - పవిత్ర ప్రాంతాలు

# కాలడి (కేరళ) ఆదిశంకరాచార్యులు

భారతదేశంలో హిందూధర్మ పటిష్టతకై మరియు పునః ప్రతిష్ఠకై కృషి చేసిన మహానుభావులకు జన్మనిచ్చిన పవిత్ర స్థలాలను మనం దర్శించుకుని ధన్యమవుదాం.

కాలడి, కేరళ రాష్ట్రంలోని త్రిచూర్ జిల్లాలో ఒక గ్రామం ఈ గ్రామంలో జన్మించిన ఆదిశంకరులు సకలశాస్త్రపారంగతుడై హిందూ ధర్మజాగరణకై ప్రజలలో ఏకాత్మభావన కలిగించుటకై భారతదేశ పర్యంతం పర్యటించిన మహానుభావుడు.

వేద ధర్మ సంరక్షణకై శాశ్వత ప్రాతిపదికన చతుర్ధామాలలో నాలుగు పీఠాలను దేశానికి నలువైపుల స్థాపించినాడు. ఉత్తరాన బదరీనాథ్ యందు దక్షిణాన కర్నాటకలోని శృంగేరి వద్ద పశ్చిమాన ద్వారక లోను తూర్పున ఒరిస్సాలోని పూరిలోను ఈ చతుర్ధామాలున్నాయి. చివరికి కంచిలో గడిపి, కామకోటి పఠాన్ని నిర్మించాడంటారు.

ఒక్కొక్క ధామం ఒక్కొక వేదాన్ని సంరక్షించాలి.

కేరళలోని కాలడిలో జన్మించిన శంకరులు ఉత్తరాన హిమాలయాలలోని బదరీనాథ్‌లో తన తల్లి బంగారు ఆభరణాలు అమ్మి 2300 అడుగుల ఎత్తుగల ఒక దివ్యమైన ఆలయాన్ని నిర్మించినాడు.

ఈ విధంగా శంకరాచార్యులు భాష, ప్రాంత కుల వర్గ తదితర వైషమ్యాలకు, వైరుధ్యాలకు అతీతంగా దేశంలో ఏకాత్మతా భావం నిర్మాణం

కోసం అహరహం కృషి చేసిన మహానుభావుడు సదాస్మరణీయుడు అయిన ఆదిశంకరులకు జన్మనిచ్చి కాలడిగ్రామం ధన్యమైంది.

# కన్యాకుమారి (తమిళనాడు)

## స్వామి వివేకానంద స్ఫూర్తి కేంద్రం:

భారతదేశ చరిత్రలో మరుపురాని మరువలేని మహానుభావుల్లో ఒకరు స్వామి వివేకానంద జాతికి దేశ భక్తి, ఈశభక్తి, కర్తవ్యదీక్ష సేవాభావ, పరాక్రమ, సత్యసంధతల విషయంలో సరియైన జ్ఞానాన్ని అందచేసిన అపరశ్రీరాముడే అవివేకానందుడు.

కన్యాకుమారిమాతను దర్శించుకుని పరమపవిత్రమైన హిందూమహాసముద్రమును ఈది సముద్రములోని పెద్ద బండపై ఆసీనుడై భారత దేశ చరిత్రను స్మరించుకుంటూ సమాధిస్థితుడై తన భవిష్యత్కార్య ప్రణాళికను దర్శించుకున్న పవిత్ర సందర్శనీయస్థలం ఈ కన్యాకుమారి.

వివేకానందునికి ధ్యేయ దర్శనం కలిగిన స్థలమిది. రా.స్వయం! సంఘ ద్వితీయ సరసంఘచాలక్ పరమపూజనీయ గురూజి 1969 లో వివేకానంద శతజయంతి జరిపించి వివేకానందుడు తపస్సు చేసిన సాగర శిలపై బ్రహ్మాండమైన స్మారకమును నిర్మించవలసినదిగా శ్రీ ఏకనాథ రానడే గారిని ఆదేశించినారు. శ్రీ గురూజి సంకల్ప బలం శ్రీ ఏక నాథ రానడే కర్తవ్యనిష్ఠల ఫలితంగా అక్కడ నేడు ఒక అత్యద్భుతమైన స్మృతి మందిరం తయారయింది. భారతీయులకది భవ్యమైన తీర్థక్షేత్రమయింది. అది నేడు వివేకానందరాక మెమోరియాల్‌గా సుప్రసిద్ధమయింది.

నేడది నిరంతర స్ఫూర్తినందిస్తూ ధర్మజ్యోతిని నలువైపుల ప్రసరింపజేస్తున్నది.

## కలకత్తా (దక్షిణేశ్వరం) (బెంగాల్)

విశ్వాభ్యుదయానికై సకలమానవాళి సమైక్యతకై ఒక పవిత్రమూర్తికి జన్మనిచ్చింది కలకత్తా నగరం.

1869 లో సంక్రాంతి రోజున సూర్యుని గమనంలో మార్పువచ్చినట్లే ఈ మహానుభావుని జన్మమువలన ప్రపంచంలో మార్పు కలుగడానికి అవకాశమేర్పడింది.

### ఆమహానుభావుడే స్వామివివేకానంద

నరేంద్రుడిలో జాతీయతను, స్వాభిమానాన్ని దైవభక్తిని, ధర్మానురక్తిని శౌర్యధైర్యాలను అచంచల ఆధ్యాత్మికశక్తిని, మేధాసంపత్తిని మేల్కొల్పిన మహాతపస్వి శ్రీ రామకృష్ణ పరమహంస జీవితంతో ముడిపడిన ప్రాంతం దక్షిణేశ్వరం. ఆసమర్థవంతమైనగురువు పరిశ్రమలో నుండి ఈ అద్భుతమైన శిష్యుడు ఆవిర్భవించి అవనిపై నున్న జనోద్ధరణకై అంకితమైనాడు.

## టంకారా (గుజరాత్, సౌరాష్ట్ర)

బానిసత్వం, పాశ్చాత్యభావం ఆత్మన్యూనతా ఇదితర లక్షణాలతో ఉన్న హిందూ సమాజంలో అల్పజ్ఞానులు స్వల్ప విషయాల్లో వైరుధ్యాన్ని పెంచుతున్న సమయంలో వివిధ రకాల ఆరాధన పద్ధతుల [illegible] ప్రచారం వల్ల ఏకత్వం సమాజంలో సమసిపోయినప్పుడు, ఈ ధర్మ [illegible] ధార్మిక

జాగరణకై, ఈ వేద భూమిలో వేదోద్ధరణకై, సమాజ సముద్ధరణకై ఆవిర్భవించింది, ఈ అవనిపై ఒక అనితర జ్యోతి గుజరాత్‌లోని 'టంకార' గ్రామంలో, సామవేదీయ ఔదీచ్యకుటుంబంలో. చతుర్వేదాలను, పురాణాలను, ఇతిహాసాలను, ఉపనిషత్, - తర్క, -వ్యాకరణ, - మీమాంస తదితర సకల శాస్త్రాధ్యయనం చేసి అనేక శాస్త్రాలకు భాష్యం వ్రాసారు, హిందూ ధార్మిక సాహిత్యానికి ఎనలేని సేవచేసారు, పండింతులుగా చెలమణి అవుతూ సమాజంలో దురాచారాలను ప్రోత్సహించే వారికి కనువిప్పుకలిగించి సమాజంలో చైతన్యాన్ని, హిందుత్వ ప్రదీప్తులను ప్రపంచ పరివ్యాప్తం చేసేందుకై ఆజీవనము కృషి చేసిన మహనీయుడీయన.

1875 లో మొట్టమొదటి భారతదేశ ప్రాచీన సంస్కృతి రక్షణకై "ఆర్యసమాజాన్ని" స్థాపించి దేశంలోని పలు ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి వేద జ్ఞాన ప్రచారానికి దోహదం చేసి 'నతస్య ప్రతిమా అస్తి - ఏకేశ్వరోపాసనా సిధాంతంచేత సమాజంలో ఏకాత్మతను సాధించాలని తపించిన త్యాగధనుడు అపర ఆదిశంకరులు, మహర్షి, స్వామి దయానంద సరస్వతి.

## మేవాడ్ (రాజస్థాన్)

15వ శతాబ్ద కాలం అక్బర్ పరిపాలిస్తున్న రోజులు, అనేక మంది రాజులు ఢిల్లీశ్వరుడే జగదీశ్వరుడనుకుని తలవంచిన వారే కాని, శౌర్య పరాక్రమాలకు ప్రతిరూపమైన "మహారాణా ప్రతాప్" అక్బర్‌కు దాసోహమనలేదు. స్వాభిమాన ధనుడై మాతృదేశ సంరక్షణకై తన రాజ్యాన్ని రాజ్యభోగాలను పణంగా పెట్టి తుదకు కట్టుకున్న భార్యతో, కన్న పిల్లలతో కట్టు బట్టలతో అడవుల పాలైనాడు పాండవుల అరణ్యవాసానికి మించిన అరణ్యవాసం 20 సం.లు ఆరావళి కొండలలో కటిక పేదరికాన్ని అనుభవిస్తూ

కందమూలాదులు, గడ్డి రొట్టెలు, మంచినీళ్ళతో జీవిస్తూ మాతృదేశ సంరక్షణకై అహరహము అక్బర్‌తో పోరు సల్పిన ధీరోధాత్తుడు రాణా ప్రతాప్. ఇటువంటి విపత్కర పరిస్థితుల్లో కూడా అతిథి సత్కారాన్ని అమితంగా ప్రేమించేవాడు. ఒకరోజు అనుకోకుండా వచ్చిన అతిథికి ఏవిధంగా సత్కారం చేయాలో తోచక మేమే రెండు రోజులనుండి పస్తులుంటున్నామని చెప్పలేని స్థితిలో తన భావాలకు ప్రతిరూపమైన కూతురు "చంపా" తాను రెండురోజులు పస్తులుండి దాచిన రెండు రొట్టెలు అతిథికి ఇచ్చి తర్వాత తాను స్పృహ కోల్పోయింది. ఆ సంఘటనతో రాణా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇంతటి విపత్కర పరిస్థితుల్లో కూడా తన దేశ, ధర్మ సంరక్షణలకై పోరు సల్పిన అవిక్ర పరాక్రమ సంపన్నుడు రాణా ప్రతాప్. చూడావత సింహకి, మధురాణికి వీరమతి మొదలగు అసమాన త్యాగధనులకు జన్మనిచ్చింది రాజస్థాన్.

అడవులందున ఇడుములంబడి
కుడువ కూడేలేక యుండియు
విడువలేదు ప్రతాప సింహుడు
పౌరుషంబును సోదరా

మహారాణా మహోదాత్త జీవనం గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

అందుకని ఈ విధంగా అనుకుందాం!

- ఎవరిలోని దృఢత్వాన్ని చూచి హిమవంతుడు సిగ్గుతో తల దించుకుంటాడో!
- ఎవరిలోని తేజస్సును చూచి సూర్యుడు మేఘాల చాటుకు చేరతాడో!!
- ఎవరిలోని గాంభీర్యాన్ని చూచి సముద్రుడు కుంచించుకు పోతాడో!!!

© ఎవరిలోని పరాక్రమాన్ని చూచి సింహాలు గుహల్లో తలదాచుకుంటాయో, ఆయనే!

మహారాణా ప్రతాప్

36 సం. వయస్సులో ఓడిపాయాడు. 60 సం. వయస్సులో తిరిగి యుద్ధం చేసి గెలిచాడు.

# లాహోర్ (పంజాబ్)

రావి, సట్లెజ్, బియాస్, జీలం, చీనాబ్ ఈ ఐదు సింధూ నది ఉపనదులు.

పంచ్ + ఆబ్ 5 నదులు ప్రవహించిన పవిత్ర స్థలమే పంజాబ్.

## లాహోర్

శ్రీరాముని కుమారుడైన లవునిచే స్థాపించ బడిన రాజ్యమే లవపురి తదనంతరం లవపుర "లాహోర్"గా పిలువ బడింది. ఆలవపురి మన అసమర్ధతకారణంగా ప్రస్తుతం పాకిస్తాన్‌లో ఉన్నది.

# తల్వాండి

సమాజంలో పాపం, అనాచారం, అధర్మం ప్రబలి ఉన్న సమయంలో 1469లో కార్తీక పౌర్ణమి రోజున లాహోర్ సమీపంలోని "తల్వాండి" అనే గ్రామంలో "గురునానక్" జననం జరిగింది.

హిందూ జీవన విధానంలో సంస్కరణలు తీసుకురావడానికి విదేశీయుల పేరిట విరుచుకు పడిన ప్రమాదంనుండి మాతృ దేశాన్ని కాపాడాలనే దృఢ సంకల్పంతో దేశంలో ఏకాత్మతా భావాన్ని వ్యాప్తి చేయడం కోసంగాను యావద్దేశం పర్యటించాడు గురునానక్ జీ.

ఉత్తరాన హిమాలయాల ఆవల ఉన్న టిబెట్టు నుండి దక్షిణాన హిందూ సాగరంలో ఉన్న శ్రీలంక వరకు మరియు తూర్పున అస్సాం నుండి పశ్చిమాన మక్క వరకు పర్యటించి, ధార్మిక ఏకాత్మతా భావాలను జాగృతం చేసిన మహనీయుడు.

వివిధ రకాల విగ్రహారాధనలతో సమాజం విడిపోవద్దని దాన్ని విసర్జించమని భగవంతుడు ఒక్కడేనని " పరమేశ్వరుని" స్వరూపమైన జనతా జనార్ధనున్ని సేవించి తరించ మని సమాజంలో సమత మమతల సాధించమని అన్న మహోధాత్తుడు మన గురునానక్‌జీ!

"శిష్య" అనే సంస్కృత పదం నుండి 'సిక్' అనే పదావిర్భావం జరిగింది. మొదట నానక్ శిష్యులను " నానక్ పంథీలు" అనేవారు సిక్ అనే పదం స్థిరపడి "సిక్కు పంథా" ఆవిర్భవించింది.

మొత్తం మీద నాడు హిందూ ఆధ్యాత్మిక, సామాజిక క్షేత్రాలలో నెలకొని ఉన్న అస్తవ్యస్త పరిస్థితులను చక్క దిద్దడానికి, హిందూ జీవన విధానాన్ని సంస్కరించడానికి పూనుకున్న మహనీయుడు నానక్. ఉపనిషత్తులలోని "బ్రహ్మమొక్కటే" అనేది నానక్ బోధనలలోని ప్రధానాంశం.

| | | |
|---|---|---|
| 1. గురు నానక్ | (క్షత్రియ) | 1469-1530 |
| 2. గురు అంగద్ | (భాయీ లేహినా) | 1539-1552 |
| 3. గురు అమర దాస్ | (వైష్ణవుడు) | 1552-1574 |
| 4. గురు రాందాస్ | | 1574-1581 |
| 5. గురు అర్జున దేవ్ | | 1581-1606 |
| 6. గురు హరగోవింద్ | | 1606-1644 |
| 7. గురు హరిరాయ్ | | 1644-1661 |
| 8. గురు హరికిషన్ | | 1661-1664 |
| 9. గురు తేగ్ బహదూర్ | | 1664-1675 |
| 10. గురు గోవింద సింగ్ | | 1675-1708 |

"మాది పవిత్ర హిందూ ధర్మం, ఇది మాకు అత్యంత ప్రియమైనది. ఇహలోక, పరలోక, సౌఖ్యాలు రెంటినీ మా ధర్మం మాకొసగుతుంది. ప్రపంచంలో మరే ధర్మం మా ధర్మంతో సమానంగా నిలువ లేదు. ప్రపంచంలో ఈ ధర్మ రక్షణకోసమే మేము నడుం బిగించాం, మీరు ఎన్ని ప్రయత్నాలు చేసినా దీనిని నాశనం చేయలేరు".

"పవిత్ర హిందూ ధర్మాన్ని వదలి వేరే మతాన్ని ఆశ్రయించ వలసి వస్తే అంతకంటే మృత్యువునే నేను స్వీకరిస్తాను" అన్న గురుతేగ్ బహదూర్ అక్షరాల తాను ఆచరించి చూపాడు.

1675వ సంవత్సరమున నవంబర్ 11వ తేదీన మధ్యాహ్నం గురుతేగ బహదూర్ మహాబలిదానం ఢిల్లీలోని చాందినిచౌక్ వద్ద జరిగింది. ఔరంగా జేబు మత దురహంకారానికి గురుతేగ బహదూర శిరస్సు ఖండించబడింది. ప్రపంచంలో అద్భుతమైన, అద్వితీయమైన బలిదానం ఇది.

తదనంతరం 10 సం.ర వయస్సులోనే గురుపీఠాన్ని 10వ గురువుగా స్వీకరించాడు గురుతేగ్‌బహదూర్ కొడుకు గురుగోవింద సింహుడు. ఆసమయంలో చాలామంది హిందువులు ధర్మ సంరక్షణకై సిక్కులను "ఖాల్సాలుగా రూపొందిచాడు. ఖాల్సా అంటే "స్వచ్ఛమైన వ్యక్తి" అని అర్థం (1699లో ఏర్పడింది ఖాల్సా) గురుగోవింద సింగ్ రూపొందించిన ఖాల్సాలు మొగలాయిలకు మరియి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాటాలు సాగించారు, బలిదానాలు చేసారు.

హింధూ ధర్మ రక్షణకై తన రక్తాన్ని ధారపోసి, రణరంగంలో తన కన్నబిడ్డల సైతం కోల్పోయి సర్వస్వాన్ని హిందూ సమాజానికై అర్పించిన మహాకేసరి గురు గోవిందుడు.

సకల జగత్‌మే ఖాల్సా పంథ్‌గాజే
జగే ధరమ్ హిందూ తురక బండ బాజే.

## సర్‌హింద్ (పాటియాల)

గురుగోవిందుడు తన తండ్రియైన గురుతేగ్ బహదూర్‌ను హిందూ సమాజానికై బలిదానం చేయవలసిందిగా గుర్తు చేస్తే గురుగోవిందుని పుత్రులు వారే స్వయంగా బలిదానం చేసుకున్నారు.

ఫతే సింహ్ మరియు జోరావరసింగ్ మొగల్ పాదుషా యొక్క హిందూవ్యతిరేకతకు మత దురంహకారానికి తగిన గుణపాఠం నేర్పారు. మహావీరులు మహా త్యాగధనులు ఎవరైనా ఉంటే వారు భారత్‌లోనే ఉన్నారంటూ తన అసమాన బలిదానంవల్ల ప్రపంచానికి చాటి చెప్పారు.

సర్‌హింద్ ప్రాంత పాలకులు గురుగోవింద్ కుమారులైన వీరిని ముస్లింలుగా మార్చడానికి శతధా ప్రయత్నించి విఫలురై వీరిని క్రూరాతి

క్రూరంగా హత్యచేసారు. ఇద్దరిని పక్క పక్కన నిలబెట్టి గోడలు కట్టి సజీవ సమాధి చేసారు. అయినా వారు మరణించడానికి సిద్ధమయ్యారే తప్ప మతం మార్చుకోలేదు. తమలో ప్రవహిస్తున్న హిందూ జాతి రక్తం యొక్క పరాక్రమాన్ని వారు ప్రదర్శించారే తప్ప విమతీయులకు లొంగి పోలేదు.

ఇద్దరు సోదరులు తానే ముందు చనిపోవాలని పోటీ పడ్డారు. భౌతకంగా మనం బలి అయినా సరె మన హిందూదేశాన్ని, మన హిందూ ధర్మాన్ని సంరక్షించడమే మన జీవిత పరమావధిగా ఉండాలనె అమూల్యమైన సందేశాన్ని తమ బలిదానం వల్ల హిందూజాతికి అందించిన మహా పురుషులు ఫతేసింహ్ జొరావర్ సింహ్‌లు. వారు మనకు ప్రాతః స్మరణీయులు.

రఖో ఈటే ధరోగారే
చునో దీవార్ హతియారే
నికలతే సాంస్ బో లేగీ
హమారే లాశ్ బోలేగీ
యహీ దీవార్ బోలేగీ
హజరో బార్ బోలేగీ

హమారీ దేశ్ కీ జయహో - హమారీ ధర్మకీ జయహో
గురూ దశమేశకీ జయహో - శ్రీ గురుగ్రంథికీ జయహో

ధర్మ రక్షకుల పవిత్ర బలిదాన స్థలం సర్హింద్.

# వీరమాత జిజియాబాయి
# సింద్ ఖేడ్ (మహారాష్ట్ర)

హిందూ ధర్మరక్షణకై కంకణం కట్టుకొని, ముష్కర మొగలాయి గుండెలనెదిరించి హైందవీయ సామ్రాజ్యాన్ని నిర్మాణం చేసిన శివాజీ చరిత్ర వెనుక అతని మాతృమూర్తి జిజియాబాయి శిక్షణ, ప్రేరణ ప్రధాన కారణమయింది.

## స్వాభిమాన స్వరూపిణి జిజియాబాయి:-

తన కన్న తండ్రితో అన్న మాటలివి. తనతండ్రి మొగలాయిల మెప్పుకై మహారాష్ట్రులపై దాడి చేస్తున్న సందర్భములో 4 నెలల గర్భవతియై గుర్రం ప్రయాణం చేయలేక భర్తను పొమ్మని తను మధ్యలో ఆగి తన తండ్రితో, మొగలుల మెప్పుకొసం సాటి మహారాష్ట్రీయున్ని బంధించడానికి వచ్చావా, పరాయివారి పంచనపడి ఉంటూ స్వధర్మాన్ని కించపరచడానికి సిద్ధ పడ్డ ద్రోహివి నీవు, అన్న జిజియా మాటలకు కోపంతో నువ్వు ఎవ్వరితో మాట్లాడుతున్నావో తెలుసా!, అన్న తండ్రితో జిజియా ఈవిధంగా అన్నది.

"ఆ! తెలుసు. నేను మొగలాయి స్నేహితునితో, మహారాష్ట్రుల శత్రువుతో మాట్లాడుతున్నాను. మరాఠా స్త్రీ తన భర్తకు తప్ప మరెవరికి భయపడదు". ఈవిధంగా తన పతిభక్తిని, రాష్ట్రభక్తిని ధర్మానురక్తిని ప్రదర్శించిన స్వాభిమాన స్వరూపిణి జిజియాబాయి.

ఆమె భవాని మాతతో, ఓతల్లీ! నాకు నీ దశవిధాయుధాలలో ఒక ఆయుధ శక్తిని ప్రసాదించు. మహారాష్ట్రుల పరసేవావ్యామోహాన్ని తొలిగించి,

స్వతంత్రమైన, శక్తివంతమైన హిందూ సామ్రాజ్య నిర్మాణ వైభవాన్ని కన్నులారా కాంచు భాగ్యమును ప్రసాదించమని ప్రార్థించేది.

అందరు గర్భిణీస్త్రీలవలె ఆమె రుచికరమైన పదార్థాల కోరక రామాయణ, మహాభారతాది గ్రంథాలను క్షుణ్ణంగా చదివించింది. కొండశిఖరాలపై నున్న కోటల నెక్కుట, కత్తిసాము గుర్రపు స్వారీ, రాజకీయ సమస్యలను గూర్చి చర్చించుట, పులులతో పోరాడుట వంటి పనులను కోరుకునేది.

తత్కారణముగానే ఆమె ఆలోచనలకు ప్రతిబింబముగా ఆమె భావాలకు ప్రతిరూపంగా స్వతంత్ర హిందూ సామ్రజ్య ఆశాజ్యోతి అయిన సింహవిక్రముడైన వీర శివాజి 1630 ఫిబ్రవరి 19 న జన్మించాడు.

తనభర్త షహాజి తుకాబాయి అనే ఆమెను వివాహం చేసుకుని తనను అశ్రద్ధ చేసినప్పటికి శివాజిని తనవద్దనే ఉంచుకొని తన చేతులపైన విద్యాభ్యాసం కొనసాగించింది. రామాయణ, భారత, భాగవతాలలోని వీర రసప్రపూరిత గాథలను వివరిస్తూ శివాజిలో ఆద్యాత్మిక రాజకీయ సామాజిక, ధార్మిక, స్వాభామాన భావాలను ఉద్దీప్తం చేసింది.

1674లో శివాజి, శివాజికొడుకు శంభాజీలను ఔరంగజేబు ఆగ్రాకోటలో బంధించాడు, మరొక వైపు తనభర్త మరణించాడు ఇంతటి విషమ సమయంలో ఎంతో సంయమనంతో అసామాన్య ప్రజ్ఞాపాటవాలతో రాజ్యభారాన్ని తన భుజస్కంధాలపై మోపుకుని ఎంతో నేర్పుతో కర్తవ్యనిర్వహణ చేసింది.

1674 జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినాడు శివాజి పట్టాభిషేకము కన్నులారా గాంచి తన సంకల్పం నెరవేరిందని సంతసించి తన జీవితం ధన్య మైనదని భావించి శివాజి పట్టాభిషేకం జరిగిన 12 రోజులకే జిజియామాత స్వర్గసురాలైంది.

ఆమె మరణం వలన ఒక్క శివాజియో కాదు యావత్ హిందూ సమాజము ఒక మార్గ దర్శకురాలిని వాత్సల్యపూర్ణయైన మాతృమూర్తిని కోల్పోయింది.

వీరపత్నిగా, వీరమాతగా చక్కని మార్గ దర్శకురాలిగా పరిపాలన దురంధరిగా భారత దేశ చరిత్రలో భారతీయుల హృదయాలలో శాశ్వతమైన ప్రముఖమైన స్థానాన్ని అలంకరించిన ఆదర్శమూర్తి జిజియామాత.

## శివనేరి, పూనా (మహారాష్ట్ర)

1630 ఫిబ్రవరి 19 న జన్మించిన బాలశివాజి అనతి కాలంలో భారతీయుల ఆశాజ్యోతిగా ఎదిగినాడు. తన తల్లి ద్వారా విన్న రామాయణ, భారత, భాగవతాలలోని యశోగాథల నుండి స్ఫూర్తినొంది దుష్ట శిక్షణ చేసి స్వతంత్ర సామ్రాజ్యాన్ని నిర్మించడము తన జీవన లక్ష్యంగా పెట్టుకుని లక్ష్యసాధన కోసమే తన జీవితంలోని ప్రతిక్షణమును, అణువణువును అర్పించిన మహాత్యాగధనుడు వీర శివాజి

ఒకసారి తురకకసాయివాడు ఆవును చంపడానికి తీసుకొనిపోతుండగా చూసిన శివాజి తన తలను ఆవుపై ఉంచాడు. తలారులను నివారించాడు. గోమాతను రక్షించాడు. ఇది శివాజి బాల్య జీవితంలో సాధించిన ప్రథమ విజయంగా చెప్పవచ్చును.

సహ్యాద్రి పర్వత పంక్తుల్లో కోటలను, శత్రువులను జయించడం అభ్యాసం చెసాడు.

దాదాజి కొండదేవ్ క్షాత్ర వీర్యం సమర్థ రామదాసు ద్వారా బ్రహ్మతేజాన్ని తనలో నింపుకుని భవాని మాత ఆశిస్సులతో తన తల్లి జిజియాభాయి మార్గదర్శనంతో పురోగమించి తన 18 వ ఏటనుండి

కోటలను పట్టుకునే వేటను ప్రారంభించాడు. 1657 లో తొరణ పురంధర, సింహగఢలతో పాటు మరెన్నింటిని జయించాడు. అఫ్జల్‌ఖాన్ అంతంచేసి బీజాపూర్ సుల్తాన్‌కు సింహ స్వప్నమయ్యాడు మొగలులపైన దాడి చేసి 23 కోటలను సూరత్‌ను వశపరుచుకొని ఔరంగాజేబుతో సంధి చేసుకుని 23 కోటలిచ్చాడు 1666లో శివాజీని ఆగ్రాకోటలో ఔరంగాజేబు బంధించగా. శివాజి అతిచాకచక్యంతో అక్కడినుండి తప్పించుకున్నాడు.

1670 లో శివాజి మొగలులపైన తిరిగి యుద్ధభేరీ మ్రోగించి 23 కోటల్నే కాక సూరతనుండి ఖాన్‌దేశ, భీదర్ మొదలగువాటిపై దిగ్విజయయాత్ర సాగించాడు.

1674 లో జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినాడు వీర శివాజి, ఛత్రవతి శివాజీగా సింహాసనా రూఢుడైనాడు.

బెల్లరీ, గోవా, డామన్, కార్వాల్, బెంగుళూర్, చెల్నూరు జింజి, తంజావూర్ ఇప్పుడున్న కర్నాటక, తమిళనాడులు మరియు మహారాష్ట్ర తదితర ప్రాంతాలతో సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించాడు శివాజి.

1680 లో శివాజి మరణించాడు. శీలం, శౌర్యం కలబోసుకున్న రూపమే వీరశివాజి. గెరిల్లా యుద్ధంలో శివాజికి సాటి మరొకరు లేరు.

**శివాజి పాలన:-**

శివాజి చేతిలో సర్వాధికారాలున్నా నియంతగా మారలేదు. తన రాజ్యాన్ని మూడు భాగాలు చేసారు. ఒక ప్రధానమంత్రి ఉండేవాడు. ఆయననే పీష్వాలనేవారు. "అష్టప్రధానులు" వివిధ శాఖలను చూచేవారు. తన రాజ్యంలోని మూడు భాగాలకు ముగ్గురు రాజప్రతినిధులు (గవర్నర్స్) మళ్ళీవారికి సహాయంగా అష్టప్రధానులుండేవారు.

## రైత్వారి విధానం:-

తన రాజ్యంలోని భూములను సర్వేచేయించి వ్యవసాయ భూములనుండి వచ్చే సాగుబడి మరియు వాటికున్న నీటి పారుదల సౌకర్యాలను దృష్టిలో ఉంచుకొని పన్నులు విధించేవారు. రైతులకు ఋణ సహాయం, కరువు సమయాల్లో ఉచిత సహాయం, పన్ను రద్దు ఉండేది.

## సైన్యం:-

యుద్ధ విద్యలలోను మరియు గుణ వికాసం, శీల నిర్మాణం దేశ, ధర్మ భక్తి మొదలగు విషయాలు సైనుకులలో నాటుకునే విధంగా ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవాడు. అందరికి సరిపడ వేతనాలతో పాటు వారి ప్రతిభను బట్టి జాగీర్లు, బహుమతులిచ్చేవాడు.

## లౌకిక వాదం:-

సెక్యులరిజం ఇప్పటి వారంతా శివాజినుండి నేర్చుకోవాలి హిందూ సామ్రాజ్య నిర్మాత అయిన శివాజి ఎప్పుడు ఇతరమతాల వారిని అవమాన పర్చలేదు. ఏ స్త్రీ పట్లనైన తన సాధారణ సైనికుడి నుండి సైన్యాధిపతి వరకు ఎవరు అసభ్యంగా ప్రవర్తించిన అతికఠినమైన దండనలు విధించిన సంఘటనలు ఉన్నాయి. శత్రు స్త్రీలను కూడా మాత అని సంబోంధించి సత్కరించిన సందర్భాలు అనేకం. "కాఫీఖాన్" అనే చరిత్రకారుడు ఈ విశయాలను ఎంతో గౌరవంతో ప్రస్తుతించాండు. ఆనాడు శివాజి జన్మించి ఉండకపోతే ఈ రోజు హిందూ దేశం (హిందువులు) ఉండేదికాదు. వీర శివాజి హిందూ సామ్రాజ్య నిర్మాత! శివాజి మన భారత భాగ్యవిధాత!!

## శివాజి తర్వాత!

శివాజి తర్వాత కూడా హిందూ సామ్రాజ్య అభివృద్ధి, పరిపాలన అవిచ్ఛిన్నంగా కొనసాగింది. శివాజి కొడుకు "శంభాజి" 1680 నుండి 89 వరకు పాలించి ఔరంగాజేబుచే హత్య గావింపబడ్డాడు. వెంటనే శివాజి రెండవ కోడుకైనా "రాజారామ్" పరిపాలన స్వీకరించి మొగలులపై దాడి చేయడం కొనసాగించాడు. ఈయన మరణానంతరం రాజారామ్ భార్య వీరపత్ని అయిన 'తారాభాయి' పాలన కాలంలో కూడా మొగలులు ఎన్నో ఎదురు దెబ్బలు తిన్నారు. తర్వాత కూడ 'సాహు' శంభాజి కొడుకు పాలించాడు. మారాఠులతో పోటీపడ్డ మొగలు సామ్రాజ్యం 1751 వరకు క్షీణిస్తూ వచ్చింది.

1761 లో జరిగిన 'పానిపట్' యుద్ధంలో మరాఠాలు వెనుకడుగు వేసిన వెంటనే తిరిగి మాధవరావు సారథ్యంలో బలం పుంజుకొని భారత్ లో ఎదురులేని శక్తిగా ఎదిగారు 1771 తర్వాత బ్రిటీష్ వాళ్లకు పోటి అంటే మరాఠాలే అన్న స్థాయికి ఎదిగారు.

# స్వాతంత్ర్య వీర సావర్కర్
# భగూర్ (నాసిక్ జిల్లా మహారాష్ట్ర)

భారత స్వాతంత్య సమరంలో అద్వితీయమైన పాత్రను పోషించి తన రచనల ద్వారా వందలాది ప్రఖ్యాత విప్లవకారులను తయారు చేసి, తన అత్యంత సాహసోపేతమైన వీరోచిత కృత్యముల ద్వారా ప్రపంచాన్నే ఆశ్చర్యంలో ముంచెత్తిన ప్రఖర దేశభక్తుడు, విప్లవాగ్రేసరుడు అయిన 'వినాయక దామోదర్ సావర్కర్' 1883 సం. మే 28 న మహారాష్ట్ర లోని నాసిక్ జిల్లాలో ఒక చిన్న గ్రామమైన "భగూర్" లో జన్మించారు.

పుట్టుకతోనె కవి దేశ భక్తుడు అయిన సావర్కర్ 1857 'స్వరాజ్య సంగ్రామం' అనే పుస్తకాన్ని రచించాడు. దేశ ద్రోహ నేరంపై రెండు యావజ్జీవ కారాగార శిక్షలు పడి (50 సం. శిక్ష) 1921 వరకు అండమాన్లో శిక్షను అనుభవించి 1927 నుండి 1937 వరకు రత్నగిరి జిల్లాలో గృహనిర్బంధంతో గడిపినారు.

1938లో తనపై ఆంక్షలు తొలగగానే హిందూ మహాసభకు అధ్యక్షుడై ఉత్సాహంగా ఉద్యమంలో పాల్గొన్నాడు. దేశ విభజనను తీవ్రంగా వ్యతిరేకించాడు. 1964 లో "అప్రతిహతి స్వాతంత్ర్య వీర" అనే బిరుదుతో మహారాష్ట్ర, భారత్ ప్రభుత్వాలు సత్కరించాయి. వారు బంధీగా ఉన్న గదిని జాతీయ స్మారక చిహ్నంగా ప్రకటించారు.

తన 86 వ ఏట 1966 ఫిబ్రవరి 26న తనువును చాలించాడ వీర సావర్కర్ తను తన కుటుంబాన్ని అపూర్వమైన రీతిలో స్వాతంత్ర్య సముపార్జనా సమరాని అంకితం చేసిన మహాత్యాగి కనుకనే ఆయనపేరు స్వాతంత్ర్య వీరసావర్కర్గా చరిత్రలో శాశ్వతమైంది.

# బీయూర్, ఝాన్సీ, గ్వాలియర్
# ఝాన్సీ లక్ష్మిబాయి

కేవలం భారత దేశానికే కాక ప్రపంచ మహిళాలోకానికే వన్నె తెచ్చిన చైతన్యమూర్తి, గొప్ప సేనాపతి అత్యంత సాహసి అయిన ఝాన్సిరాణి లక్ష్మిభాయి 1835 నవంబర్ 19న కార్తీక మాసంలో "బీయూర్" అనే గ్రామంలో జన్మించింది "మనూబాయిగా". బీయూర్‌లో తన తండ్రి పోషణలో ధార్మిక మరియు యుద్ధ విద్యలు చక్కగా నేర్చుకున్నది.

ఝాన్సి:-

1842 లో ఝాన్సిరాణికి గంగాధరరావుతో వివాహమైనప్పటి నుండి మానూబాయి ఝాన్సిరాణిగా వాసికెక్కింది. 1851 లో లక్ష్మిబాయి ఒక కొడుకుకు జన్మనిచ్చింది. కాని మూడు నెలలకే బాలుడు చనిపోయాడు. 1853 లో ఆనందరావు (దామోదరరావు) అనే బాలుడుని దత్తత తీసుకున్నారు. 1853 నవంబర్ 21 న గంగాధర రావు మరణించడంతో 18 సం. యుక్తవయస్సులో లక్ష్మిబాయి విధవగా మారింది. 1854 లో అధికారాన్ని బ్రిటీష్ వారు తీసుకున్నాక ఝాన్సిరాణి సంఘర్షణకు తయారి ప్రాంభించింది.

రాజ్యం యొక్క భౌగోళిక స్థితిని, సామాజిక ప్రాముఖ్యత కలిగిన పవిత్ర క్షేత్రాలను పంజాబ్‌లో ఏర్పడిన సిక్కు సేన నిర్మాణాన్ని ఆమె చక్కగా అధ్యయనం చేసింది.

యుద్ధరంగంలో బ్రిటీష్ వారి తుపాకి నుండి బయటికి వచ్చిన గుండు రాణి దేహానికి తాకిన స్థలమది " గోలీపార్" తర్వాత గ్వాలియర్ అయిందని అంటారు.

1858 జూన్ 28 వరకు 22 సం. 6 నెలలు జీవించి గాఢాంధకారం లో ఒక మెరుపులా ప్రకాశించి మాయమైంది. ప్రాతః స్మరణీయురాలైన, ఆదర్శమూర్తి అయిన వీరాంగన మన ఝాన్సీ లక్ష్మిబాయి.

# వేణు బ్రహ్మావర్త్
# కాన్పూర్ జిల్లా (ఉత్తర ప్రదేశ్)

## నానాసాహెబ్ పీష్వా

వేణు అనేది ఒక సుందర కుగ్రామం. ఇక్కడ మాధవరావు నారాయణభట్, గంగాబాయి దంపతులు 1824 లో ఒక మగశిశువును కన్నారు. అ శిశువు వెవరో కాదు! ఎవరిపేరు వింటే బ్రిటీష్ వారి గుండెలు బేజారయిపోయేవో! ఎవరిపేరు వింటే ఫిరంగీలు సైతం గడగడలాడేవో! మన దేశ స్వాతంత్ర్యముల్కై తన జీవిత సర్వసాన్ని ధారవోసి ఝాన్సిలక్ష్మిభాయి, తాంతియాతోపే, అజీముల్లాఖాన్ లాంటి వందలాది మందికి స్ఫూర్తిధాతగా నిలిచి చరిత్రలో అమరుడైన ఆ మహానుభావుడే పీష్వా నానాసాహెబ్.

1824 తర్వాత బ్రహ్మవర్తములో నున్న భాజీరావు వద్దకు వచ్చారు. 1827 జూన్ 7న బాజీరావు నానాసాహెబ్‌ను దత్తత తీసుకున్నాడు. 1851 లో బాజీరావు పీష్వామరణించగా నానాసాహెబ్‌కు అధికారం సంక్రమించింది. సకలైశ్వర్యాలున్నప్పటికి మాతృదేశ స్వాతంత్ర్యం కోసం అనుక్షణం ఆరాటపడ్డాడు పోరాటం సల్పినాడు.

## నానా కార్యక్రమం:-

సంయుక్తపోరాటం నిర్వహించడం; దేశాన్ని విముక్తి చేయడం పరస్పర నాశన కరమైన పోరును నిలిపి వేసి సంయుక్త భారత రాష్ట్రమును నెలకొల్పుట. ప్రపంచ స్వతంత్ర్య రాష్ట్రములందు మనదేశానికి సముచిత స్థానాన్ని కల్పించడం నానాలక్ష్యంగా ఉండింది. ఎంతో చాకచక్యంతో అత్యంత రహస్యంగా దేశవ్యాప్తంగా ఒకేసారివిజృంభించాలనే ఆలోచనతో కాన్పూర్, లక్నో, గ్వాలియర్, ఢిల్లీ, హైద్రాబాద్, మద్రాస్ ఇంకా ఎన్నోచోట్ల విప్లవ ప్రచారం కొనసాగింది. స్వదేశీయుల ద్రోహంతో బ్రిటిష్ వారి కుటిల యత్నాలవల్ల 1857 విప్లవం విఫలమయింది. అప్పుడు 60 వేల మంది విప్లవకారులతో నేపాల్ వెళ్ళాడు. నానా, నేపాల్ రాజు బ్రిటీష్ వారికి సహకరించడంతో గత్యంతరం లేని పరిస్థితులల్లో అడవులలోకి అజ్ఞాతంలోకి వెళ్ళారు విప్లవకారులు. 1858 జూన్ నుండి 1859 ఎప్రిల్ వరకు అయోధ్య రాజ్యం బ్రిటీష్ వారితో పోరాడింది. 1859లో స్వతంత్ర వీర సేనాని చైతన్యమూర్తి, మహత్యాగి అయిన నానాసాహెబ్ తప్పనిసరి పరిస్థితులలో అడవుల పాలు కావలిసి వచ్చింది.

ఆ మహానుభావుని చరిత్ర మహోజ్వాలమైనది.

# నలంద (బీహార్)

ప్రపంచంలో అతి ప్రాచీన విశ్వవిద్యాలయాలలో ఒకటి ఇది. ప్రపంచం నలుమూలలనుండి జ్ఞాన సముపార్జనకై వేలాది మంది భారత దేశంలోని ప్రసిద్ధి చెందిన తక్షశిల మరియు నలంద విశ్వవిద్యాలయాలకు వచ్చేడివారు. దాదాపు వేయి సం. క్రితమే మన వద్ద వేలాది మందికి వివిధ విషయాలలో ఉచిత ఆవాసం భోజనాలతో విద్యను అందించే వ్యవస్థ మన

దేశంలో ఉండింది. వందాలాది మంది ఆచార్యులు అక్కడే ఉండి అనుక్షణం విద్యార్థులను గమనిస్తూ అణుశాసనంతో ఉంచెడివారు. ప్రపంచంలోని నేటి యూనిర్సిటీలు మన ప్రాచీన విశ్వవిద్యాలయాలకు ప్రతి రూపమే.

నలందా విశ్వవిద్యాలయంలో 10 వేల విద్యార్థులుండేవారు. వీరందరని హతమార్చి అచటి విశ్వవిఖ్యాత గ్రంథాలయములను నిప్పు పెట్టారు. విద్యాలయాన్ని నేలమట్టం చేసారు. విజ్ఞానంయొక్క విలువతెలియని, తేలుసుకోలేని మతిలేని విమతియులు.

# హరిహర బుక్కరాయులు
# హంపి (కర్నాటక, ఆంధ్ర)

విదేశీయుల పాలనా కాలంలో వారి కుటిల నీతివల్ల పరాజయమార్గంలో పారిపోతున్న హిందుత్వం తన ప్రతిభను, పటిమను గుర్తించి, కబలించడానికి వస్తున్న మ్లేచ్ఛులను తరిమికొట్టింది. తుంగబద్రా తీరంలో సామాన్యులు సైతం స్వధర్మరక్షణకై సాహస పరాక్రమాలు ప్రధర్శించారు.

కుందేళ్ళు సైతం సింహల్లా చెలరేగి వేటకుక్కలను వెన్నంటి తరిమాయి.

శ్రీ విద్యారణ్య మునిచంద్రుని ఆశిస్సులతో 1336 లో విజయనగర సామ్రాజ్యం హైందవ ధర్మ పరిరక్షణ లక్ష్యంతో అవతరించి దక్షిణా భారత దేశానికి రక్షణకవచంగా నిలిచింది హంపీ విజయనగర దుర్గం.

## అసామాన్యుడైన సామాన్యుడు:-

సంగమ వంశానికి చెందిన హరిహరుడు బుక్కన్న సోదరులు కాకతీయులవద్ద ఉండి 1323 ఓరగల్లును ధ్వంసం చేసిన మహమ్మదీయుల అగడాన్ని కళ్ళారా చూచి 'అనగొందె' రాజ్యానికి వెళ్ళగా ఆరాజ్యం కూడ 1334 లో ముస్లింల దాడికి గురయి వీరద్దరిని ముస్లింలుగా బలవంతంగా మతం మార్చినారు. తర్వాత హిందువులుగా వీరు మారడాన్ని మన సమాజం తిరస్కరించిన రోజుల్లో మహర్షి విద్యారణ్యుని ఆశిస్సులతో తిరిగి హిందువులై 1336లో హంపీ వద్ద విజయనగర కోటను నిర్మించి, హైందవ సామ్రాజ్యాన్ని నిర్మించి, హిందూ ధర్మధవళ కాంతులను వ్యాపింపచేసినారు. హరిహరరాయులు బుక్కరాయులు స్వధర్మ సామ్రాజ్యానికి అంకురార్పణ చేసారు. చరిత్ర గతిని మార్చారు.

విజయనగరం వంటి పెద్దకోట మనదేశంలోనే కాదు ప్రపంచంలో మరెక్కడాలేదు 1336 నుండి కొన్ని సంవత్సరాల పాటు ఈ కోటను నిర్మించారు. 1565 లో కొన్ని నెలలపాటు ముస్లింలు దిన్ని ధ్వంసం చేసారు.

విజయనగర సామ్రాజ్య వైభవాన్ని ఎందరో విదేశ పర్యాటకులు సందర్శించి ముగ్ధులై వర్ణించారు. వీధులో ముత్యాలు రాసులుపోసి విక్రయించేసేవారలు. వైభవం అలా అలగళ్ల నిండ ఉండేవట. ఇటలీ పర్యాటకుడు నికోలోకాంటి, పార్సి పర్యాటకుడు అబ్దుల్‌రాజక్, మ్యూనిజ్, జియాస్ మొదలగువారు కొనియాడిన రాజ్యమది. ఆ కాలంలో 11 లక్షలమంది సైనికులుండేవారని, 1000 ఏనుగులుండేవని, సంకలసంపదలతో సాధారణప్రజలు కూడా తులతూగుతుండేవారని ఆ పర్యాటకులు వర్ణించారు.

1509 జూలై 26 నుండి 1530 వరకు శ్రీకృష్ణదేవ రాయల పాలనాకాలం. తిమ్మరుసుదియుక్తి భారత చరిత్రలో స్వర్ణయ

అష్టలక్ష్మిలతో, అష్ట దిగ్గజాలతో సకల సద్గుణాలతో సంపదలతో నిండిన ప్రాంతమది. 1530లో శ్రీకృష్ణ దేవరాయలు వ్యాధితో మరణించారు. 1565 నుండి, ముస్లింల దాడులకు రాజ్యం బలహీన పడ్డడం పరాక్రాంతం కావడం ప్రారంభమైంది.

# ఓరుగల్లు (ఆంధ్ర పదేశ్) ముసునూరి నాయకులు

(1115-1158)లో కోట నిర్మాణం జరిగింది. ప్రోలయరాజా పరిపాలనలో తర్వాత ప్రతాపరుద్రుడు, గణపతి దేవుడు రుద్రమదేవి ఈ కోటను శత్రదుర్భేధ్యంగా హైందవ ధర్మ రక్షణకు కవచంగా నిర్మించారు. 1315 నుండి 1324 వరకు ఈ కోట హైందవ ధర్మం, సామ్రాజ్య పరిరక్షణకు స్థానమై నిలిచింది.

1323 నుండి 1366 వరకు దక్షిణభారత దేశంలో మహమ్మదీయుల దాడులను త్రిప్పికొడుతూ, వారిచే ధ్వంసం చేయబడిన దేవాలయాలను పునరుద్ధరిస్తూ తోటి హిందూ రాజులలో చైతన్యాన్ని నింపుతూ తురుష్కముష్కరుల నుండి హైందవ ధర్మాన్ని దేశాన్ని రక్షించిన మహపురుషులు త్యాగధనులు ముసునూరి ప్రోలయ కాపయనాయకులు, మహమ్మద్ బిన్ తుగ్లక్ (ఉలుగ్‌ఖాన్) ఢిల్లిని పరిపాలిస్తున్న కాలమది.

అద్దంకి రాజధానికి పాలించిన ప్రోలయ వేమారెడ్డికి, కంపెలిని కబలించిమని మహమ్మద్‌బిన్ తుగ్లక్ చే పంపబడినా ఎదురు తిరిగి హైందవ ధర్మరక్షణకై విజయనగర సామ్రాజ్యస్థాపన చేసిన హరి హర బుక్క సోదరులకు ముసునూరి నాయకులే స్ఫూర్తి ప్రధాతలు.

రేకపల్లి రాజధానిగ ప్రోలయ కొంతకాలం పాలిస్తే ఓరుగల్లు రాజధానిగ కాపయనాయకుడు పాలించి దక్షిణ భారత చరిత్రనే మార్చిన మహనీయులు వీరు.

వేయి స్థంబాల గుడి, రామప్ప గుడి చరిత్ర ప్రసిద్ధిగాంచాయి.

రామప్ప గుడి నిర్మాణమునకు ఉపయోగించిన ఇటుకలు ఒక ప్రత్యేక శాస్త్రీయ జ్ఞానంతో తయారయినవి. ఆ ఇటుకలు ఎంతో బరువున్నప్పటికి నీటిలో వేస్తే మునగవు. అటువంటి ఇటుకలతో ఆలయ నిర్మాణం జరిగింది. ఆనాడే మన విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందింది.

# ఉప సంహారం

ఇంత వరకు మనం తెలుసుకున్న ఈ అపూర్వ విషయాలే తరతరాలుగా ఈ హిందూ జాతిలో ఏకత్వభావనను స్వాభిమానాన్ని కలిగించి దేశ ధర్మ రక్షణలకై సదా సర్వసన్నద్ధంగా సమాజాన్ని ఉంచగలిగింది. భారత మాత పాద పద్మముల చెంత సర్వస్వార్పణ చేయించగలిగింది.

## ఇప్పుడు మనమేం చేయాలి మరి?

వ్యక్తివేరని సమష్టివేరనే ఆలోచనను ఇకనుండి విడనాడి వ్యక్తి శ్రేయం సమష్టిలోనే ఇమిడి ఉందనే వాస్తవ విషయాన్ని గమనించి గుర్తించి మనం కూడా మహిమాన్వితులైన, అపూర్వ త్యాగ, శౌర్య ధనులైన భారత దేశ చరిత్ర లో అమరులై భారతీయులకు సదా స్మరణీయులుగా మారిన మన పూర్వజులను సదా స్మరిస్తూ వారి జీవిత విశేషాలను అనుక్షణం గుర్తు తెచ్చుకుంటూ వారి సకల సద్గుణాలను మనం అలవాటు చేసుకుంటూ మన మాతృదేశాన్ని అన్ని రంగాలలో సువ్యవ స్థిత మొనరించుదాం.

పూర్వ వైభవాన్ని అందుకునే దిశలో మన ప్రయత్నం, మన పయనం కొనసాగిద్దాము.

"విశ్వగురువుగా విలసిల్లినది
విశాల భారతమొకనాడు.
బడుగు దేశమై పడియున్నదిలే
ఇండియా పేర ఈనాడు.

ముక్కలు చెక్కలుగా చీలిన దీ
అఖండ భారత మీనాడు.
ఎవరికి వారై విడిపోయిరి
మన అన్న దమ్ములు నేడు".

కనుక:

ఈ ప్రస్తుత దీన హీన పరిస్థితి నుంచి మన దేశాన్ని విశ్వగురుత్వ స్థానానికి తీసుకుని వెళ్ళాలి. దీని కోసంగాను ముందుగా భారతీయ ప్రజానీకంలో ఇటువంటి పవిత్రమైన భవ్యమైన భావ ఏకీకరణ, జాగరణ జరుగాలి. అదే ఈ చిన్న పుస్తక రచనలోని అంతర్యం, లక్ష్యం, ధ్వని, ప్రేరణ.

"జన జాగృత నవభారత మహోదయం
ఈ కనులతో కాంచుదాం
మన జీవితమున సాధించుదాం"

"ఇది నా దేశము వీరు నాఅనుజాలిందే నా కిహంబున్
వరంబిది నా కోరికలల్లుకొన్న దివి, ఇందేపుట్టి
జీవించి పొందుదు సత్సంగతి ఈ ధరారజములో
దొర్లాడి ఈ గాలులన్ హృదయాకాశావధినిల్పి ఈజనని
నర్చింతున్ వరాదేవిగా.

మనతల్లి భారతికి జయమగుగాక!

* * *

ఈ గ్రంథరచనకు ఉపకరించిన గ్రంథములు:-


- The Fundamental unity of India

  By:- Dr. Radha Kumud mukarji

- India Mother of us all

  By:- Chaman lal

- The Tragic Story of partition

  By:- H.V. Seshadri.

- భారత స్వాతంత్ర్య సమర చరిత్ర

  By:- స్వాతంత్ర్య వీర సావర్కర్

- విజ్ఞాన సర్వస్వము.
- రాష్ట్ర నిర్మాత - స్వామి దయానందుడు

  By:- గంగా ప్రసాద ఉపాధ్యాయ

- జాగృతి

  విశేష సంచికలు

- వైదిక క్రాంతి

- హిందూ పద -పాదషాహి

  By:- స్వాతంత్ర్య వీరసావర్కర్

- మరికొన్ని నవ భారతి ప్రచురణలు, భారత భారతి పుస్తక మాల